# ఆంధ్ర ప్రదేశ్

Regd. No. H. 373



మే, 1957

సంపుటి 1 సంచిక 7

వైశాఖము, శాలివాహనశకము - 1879



అమెరికా రాయబారి గౌరవార్థం రాజ్‌భవన్‌లో ఆంధ్రప్రదేశ్ గవర్నర్ విందుచేసిన సందర్భంలో బంకర్ దంపతులు, విందులో పాల్గొన్న ఇతర ప్రముఖులు ఏదో ఛలోక్తిపై నవ్వుతుంటున్నారు. ఈ చిత్రంలో అతిథులతోపాటు గవర్నర్ దంపతులు, ముఖ్యమంత్రి, శ్రీ కళా వెంకటరావు, శ్రీ వి. తిమ్మారెడ్డిగార లున్నారు.



**12-4-1957** తేదీన బేగంపేట విమానాశ్రయంలో మిస్టర్ ఎల్స్‌వర్త్ బంకర్, వారి సతీమణి మిసెస్ బంకర్.



# ఆంధ్రప్రదేశ్


మే, 1957

సంపుటి 1 — వైశాఖము, శాలివాహనశకము 1879 — సంచిక 7


## విషయసూచిక



— చందా —

సాలుసరి రు. 1—8—0 లేక ఒక రూపాయ 50 నయాపైసాలు

విడిప్రతి 0—2—0 లేక 12 నయాపైసాలు


ఆంధ్రప్రదేశ్ సమాచార పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి అజంతా ప్రింటర్సులో ముద్రింపబడినది.

# మహాపురుషులకు భక్త్యంజలి

[ఆంధ్రులు స్వరాష్ట్రంలోనూ, ఇతర ప్రదేశాలలోనూ పోయిన నెలలో ఇద్దరు మహా పురుషులకు తమ భక్త్యంజలి సమర్పించి, ఆ మహనీయు లిద్దరినీ మరొకమారు స్మరించు కున్నారు. కందుకూరి వీరేశలింగం పంతులుగారి 110వ జయంతి, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి 19 వ వర్థంతి పోయిన ఏప్రిల్ నెలలోనే వచ్చాయి.]





తెలుగుజాతి సాంఘికంగా, సాహిత్యకంగా పురోగ మించడానికి కారకుడయిన మహావ్యక్తి శ్రీ కందు కూరి వీరేశలింగం పంతులుగారు పవిత్ర గోదావరీ నదీతీరానవున్న ధవళేశ్వరం గ్రామంలో సాధారణ మధ్యతరగతి కుటుంబంలో జన్మించారు. ఆయన చదివింది మెట్రిక్యులేషన్ వరకు. ఆయన చేసిన ఉద్యోగాలలో అన్నిటి కంటె పెద్దదీ లాభసాటిదీ ఒకానొక ప్రభుత్వ కళాశాలలో నెలకు రూ. 60 ల వేతనంపై పండిత పదవి. అయినా ఆయన జీవితం అపూర్వమైన సంఘటనలతో అలరారి, తెలుగు జాతికే చరిత్రను కల్పించింది. ఎలిమెంటరీ తరగతులకు పాఠ్య పుస్తకాలు మొదలు, భారత జాతీయ కాంగ్రెసు మహాసభ చరిత్రవరకు మొత్తం దాదాపు 108 గ్రంథాలు ఆయన రచించాడు. తెలుగులో ఆధునిక వాఙ్మయ రూపాలన్నిటికీ ఆయన బాటలు వేశాడు. మొట్టమొదటి తెలుగు నవలను రచించింది ఆయనే. అది యూరపుఖండ భాషలలోకి సైతం అనువదింపబడింది. అంతకు

పూర్వం ఏ తెలుగు పుస్తకానికీ ఇంతటి గౌరవం పట్ట లేదు. తెలుగు కవుల చరిత్రను రచించాడాయన. కాళి దాసు అభిజ్ఞాన శాకుంతలమును తెనిగించాడు. స్వీయచరిత్ర వ్రాశాడు. సంఘసంస్కర్తగా దక్షిణ భారతం మొత్తంలోనే ప్రఖ్యాతి గాంచాడు. మూఢ విశ్వాసాలనూ, సాంఘిక దురాచారాలనూ ఎదిరించాడు. హైందవస్త్రీల ఉద్ధరణకై తన జీవితాన్ని అంకితం చేశాడు. వితంతువివాహాలు జరిపించాడు. ఎన్నో కష్ట నష్టాలను సహించి దక్షిణ భారతంలో సాంఘిక చైతన్యం కలుగజేశాడు. ఆంధ్రదేశంలో జరిగిన మొట్ట మొదటి వర్ణాంతర వివాహం – హైద్రాబాదులో జరి గిన సరోజనీదేవి, మేజర్ ముత్యాల గోవిందరాజులు నాయుడు గారల వివాహానికి ఆయనే పురోహితుడన్న విషయం ఈ తరం వారిలో చాలామందికి తెలీదు. సనాతనుల మూఢవిశ్వాసాలనూ, వారి చర్యలనూ, ఉద్యోగుల అవినీతినీ నిర్భయంగా విమర్శించాడు. అలా చేసినందుకు ఆయన అనేకమార్లు అభియోగాలకు జవాబుదారు కావలసి వచ్చింది. అయినా వాటిని లెక్క చెయ్యలేదు. ఆయన ఆరోగ్యం అంత మంచిది కాదు, సిరిసంపదలు అంతకంటె లేవు. అయినా తన జన్మస్థలమైన రాజమహేంద్రవరానికి ఆయన ఒక పుర మందిరం, గ్రంథాలయం, వితంతు శరణాలయం, ఒక ఉన్నత పాఠశాల ఇచ్చి పొయ్యాడు.

తెలుగు వారికి కర్తవ్యాన్ని ప్రబోధించి, ఆదర్శ పురుషుడుగా జీవించిన మహనీయుడు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు. కృష్ణాజిల్లా ఎలకుర్రు గ్రామంలో ఈయన జన్మించాడు. పుట్టింది సంపన్న కుటుంబంలో కాదు. ప్రకృతిశాస్త్రంలో పట్టభద్రుడు కావాలని ప్రయత్నించాడు. కాని అది నెరవేరలేదు. అయితే స్వయం ప్రతిభవల్ల గొప్ప వ్యాపారస్థుడై లక్షలు గడించి లక్షలకొద్దీ ధనాన్ని దానంగా ప్రజా హిత కార్యాలకు ఇచ్చివేశాడు. ఈయన వదాన్యతను,



*1957 ఏప్రిల్ 11 వ తేదీన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి వర్ధంతి సభలో 'పద్మభూషణ' శ్రీ మాడపాటి హనుమంతరావుగారు ప్రసంగిస్తున్న దృశ్యం. చిత్రంలో రాష్ట్ర శాసనసభాధ్యక్షులు, హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి, రాష్ట్ర ముఖ్యమంత్రి వేదికపై ఆసీనులైయున్నారు.*

దేశభక్తినీ మెచ్చుకొని మహాత్మాగాంధీ ఈయనకు "దేశోద్ధారక" బిరుదు ఇచ్చాడు. సాహిత్యాది కళలకు ఈయనచేసిన సేవను పరిగణించి ఆంధ్ర విశ్వవిద్యాలయం ఈయనకు "కళాప్రపూర్ణ" బిరుద మిచ్చింది. నాగేశ్వరరావు పంతులుగారు ప్రారంభించినట్టి ఆంధ్ర [illegible] [illegible] వారికి ప్రగాఢ విశ్వాసాన్ని కలిగించాయి. ఎందరో రచయితలను ప్రోత్సహించి వారి రచనలను తమ పత్రికలలో ప్రకటించి వాటికి పారితోషికములిచ్చి ఆదరించిన సహృదయు డీయన. స్వయంగా తెలుగులో చక్కని వచన రచయిత. ఈయన రచనలలో ధార్మిక నైతిక విలువలు ప్రస్ఫుట మయ్యేవి. భగవద్గీతపై ఈయన వ్రాసిన వ్యాఖ్యానం ప్రశస్తమైనది. గాంధీజీ అనుచరుడుగా ఈయన దేశస్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని ఆంధ్రదేశంలో భారత జాతీయ కాంగ్రెసుసంస్థకు పెట్టని కోటగా నిలిచాడు. విజయవాడలో ఈయన బహూకరించిన విశాలమైన భవనంలోనే ఇప్పుడు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం కార్యాలయం నెలకొని వున్నది.

వీరేశలింగం పంతులుగారు లేనిదే ఆంధ్రజాతి చైతన్యం లేదు. నాగేశ్వరరావు పంతులుగారు లేకపోతే [illegible] [illegible]. వారి [illegible] నేతి ఆంధ్రులు రాజకీయంగా, సాంస్కృతికంగా సమైక్యత చెందెడివారు కారు. వారి ఆశయాలు ఈడేరినవి. వారు కన్న కలలు నిజమైనవి. నూతనంగా ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రజల నిర్మాణాత్మక పురోగమనంలో ఈ మహనీయుల జీవితాలు కాంతిపుంజములై దారిచూపిస్తా యనడంలో సందేహం లేదు. వారి ఆత్మలకు పరమేశ్వరుడు శాంతిని ప్రసాదించుగాక !

* * * *

# వ్యవసాయోత్పత్తి పెరిగేవిధంగా భూ సంస్కరణలు అమలుజరగాలి

## రాష్ట్రమంత్రి శ్రీ కళా వెంకటరావు రేడియో ప్రసంగం

[ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో చాలామంది రైతులు తమ స్వంత భూములలో సేద్యం చేసుకుంటున్నారు. ఎక్కువమంది రైతులు చిన్నపాటి కమతాలు గలవారు.

రాష్ట్ర మంత్రి శ్రీ కళా వెంకటరావు భూ సంస్కరణలను గూర్చి హైద్రాబాదు రేడియో నిలయం నుంచి ప్రసంగిస్తూ 1908 నుంచి ఇంతవరకు రాష్ట్రంలో భూమి అమరిక విధానాన్ని సంస్కరించడానికి తీసుకోబడిన చర్యలను వివరించి, రాష్ట్ర వ్యవసాయ వ్యవస్థపై ఆ చర్యల ప్రభావాన్ని తెలుపుతూ, ఎటువంటి భూ సంస్కరణలను ప్రవేశపెట్టినా వాటివల్ల వ్యవసాయోత్పత్తి అధికం కావడానికి ప్రోత్సాహం లభించవలెనని అన్నారు.

మంత్రిగారి ప్రసంగం ఈ దిగువ ఉదహరింపబడింది.]

"స్థిరమైన, అభ్యుదయకరమైన, సమర్థవంతమైన వ్యవసాయ వ్యవస్థను నిర్మించే ఉద్దేశంతో, భూమికి సంబంధించిన వివిధ హక్కులను, ప్రయోజనాలను క్రమబద్ధము చేయుటకై తలపెట్టబడిన చర్యల సమూహామునే సర్వసాధారణంగా భూసంస్కరణలు అంటున్నాం. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నిర్దేశించబడిన భూసంస్కరణల ప్రాథమిక లక్ష్యాలు రెండు ప్రయోజనాల సాధనను లక్షిస్తున్నవి మొదటిది, ప్రస్తుత వ్యవసాయిక వ్యవస్థయొక్క స్వభావాన్ని పురస్కరించుకుని వ్యవసాయోత్పత్తులకు కలుగుతున్న ప్రతిబంధకాల నివారణ: రెండవది, సాధ్యమైనంత త్వరితగతిలో ఉత్పత్తికి సంబంధించిన శక్తి సామర్థ్యాలలో ఉన్నతస్థాయి అందుకోగలిగిన వ్యవసాయ ఆర్థిక విధానాన్ని నిర్మించుకోటానికి అవసరమైన పరిస్థితులను కల్పించుకొనుట. భూసంస్కరణల విధానంయొక్క లక్ష్యాన్ని గురించి మరొక సందర్భంలో యీవిధంగా నిర్వచించబడింది. "భూమి, నీరు, శ్రమ, శక్తి, పశుసంపద, పెట్టుబడి మొదలైన ప్రధాన సాధనాలను మొత్తం జనాభాలో ముఖ్యంగా వ్యవసాయంపై ఆధారపడిన వారిలో నిరంతర సమృద్ధి, సంతృప్తి కలిగేవిధానంగా, వీలైనంతవరకు వినియోగించుకొనుట."

భారతదేశం ప్రధానంగా వ్యవసాయికదేశం; ఆంధ్రప్రదేశ్ కూడా వ్యవసాయిక రాష్ట్రమే. రాష్ట్ర జనాభా 310 లక్షలకుగాను 210 లక్షలమంది, అంటే నూటికి షుమారు 70 వంతులు తమ జీవనోపాధి కొరకు ప్రధానంగా వ్యవసాయ వృత్తిమీద ఆధారపడి ఉన్నారు. రాష్ట్రంలో పంటపండే మొత్తం విస్తీర్ణం 300 లక్షల ఎకరాలు. రాష్ట్రంలో వ్యవసాయము ప్రధానమైన వృత్తి అనీ, అది ప్రజల ప్రధాన జీవనోపాధి అనే విషయాన్ని యీసంఖ్యలు స్పష్టం చేస్తున్నవి. కాగా వ్యవసాయం యింత ప్రముఖస్థానాన్ని ఆక్రమిస్తున్న రాష్ట్ర జీవితంలో భూసంస్కరణల ప్రత్యేక ప్రాధాన్యాన్ని గురించి వేరుగా వివరించ నక్కరలేదు.

### భూమి యాజమాన్యం, సేద్యం

భూసంస్కరణలకు సంబంధించిన వివిధ చర్యలను గురించి ప్రణాళికాసంఘం ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో అనేక సిఫార్సులు చేసింది. మధ్య దళారీల

నిర్మూలన, కవుళ్ళను క్రమబద్ధం చేయుట, కౌలు దార్లకు కవులు కాలపరిమితి గురించి సెక్యూరిటీ, కమతాలకు గరిష్ఠస్థాయి నిర్ణయం, ప్రభుత్వం భూము లను నిర్వహించుట, మొదలయినవి ఈ సిఫార్సులలో ముఖ్యమైనవి. దేశవ్యాప్తంగా, యీ చర్యలు తీసు కొనుటలో అవలంబించవలసిన సూత్రాలను స్థూలంగా సూచించటానికి మాత్రమే ప్రణాళికా సంఘంవారి సిఫార్సులు పరిమితమైనా, ఆయా వర్గాలను, వివిధ రాష్ట్రాలలోని స్థానిక పరిస్థితులు, అవసరాలదృష్ట్యా ఆయా ప్రాంతాలలో అమలుపరచే సందర్భంలో అనుసరించవలసిన విధానాలను గురించిన నిర్ణయం రాష్ట్రాలకే వదలివేయబడింది.

ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ ప్రాంతంలో ఇప్పటివరకు ఆయా సమయాలలో భూసంస్కరణలు అమలుపరచే సందర్భంలో తీసుకోబడిన చర్యలను వివరించే ముందుగా, రాష్ట్రంలో భూమి యాజమాన్యము, వ్యవసాయము మొదలైనవాటికి సంబంధించి అమల్లో వున్న యదార్థ పరిస్థితులను పరిశీలించటం అవసరం. ఇంతకుపూర్వం ఇటువంటి విషయాలలో అవసరమైన వివరాలు సులభంగా లభించేవికావు. ప్రణాళికా సంఘం సూచనపై 1955 లో పూర్వపు ఆంధ్ర రాష్ట్రంలో భూకమతాలు, వ్యవసాయ పరిస్థితులకు సంబంధించిన సంఖ్యావివరాలు సేకరించబడినవి. ఆ సందర్భంగా వివిధ కమతాల ప్రమాణము, విస్తీర్ణము, అందులో కౌళ్ళకు యివ్వబడిన విస్తీర్ణము, భూ ఖామందులే వ్యవసాయంచేస్తున్న విస్తీర్ణం మొదలైన వివరాలు సేకరించబడి, "స్టాండర్డ్ యకరం" అనే ప్రమాణముతో అవన్నీ లెక్కించబడినవి. ఈ లెక్కల ప్రకారం, అన్నివిధాల కమతాలలోగల 77 లక్షల స్టాండర్డ్ యకరాలకుగాను, 7 లక్షల స్టాండర్డ్ ఎకరాలు లేక మొత్తంలో 9 శాతం భూమి మాత్రమే కౌళ్ళక్రింద వున్నట్లు తెలుస్తున్నది. అంటే భూమిలో అత్యధికభాగం భూఖామందులే వ్యవసాయం చేసు కుంటున్నారన్నమాట. అంతేకాక యీ లెక్కలవల్ల తేలిన మరొక అంశమేమంటే భూఖామందులలో చాలా భాగం తక్కువ భూవసతి కలిగినవారే. పది స్టాండర్డ్ యకరాలకు మించని కమతాలసంఖ్య మొత్తం కమతాల సంఖ్యలో 90 శాతంవరకు, మొత్తంభూమి విస్తీర్ణంలో 60 శాతంవరకు ఉన్నవి. పోతే 30 స్టాండర్డ్ యకరాలకు మించిన కమతాలు మొత్తం కమతాల సంఖ్యలో ఒక శాతం మాత్రమే. అవి మొత్తం భూమి విస్తీర్ణంలో 13 శాతంవరకు ఉన్నవి. దాదాపు యిదే పద్ధతులమీద ఉమ్మడి హైదరాబాదు రాష్ట్రంలోకూడా లెక్కలు సేకరించ బడినవి. ఈ లెక్కల ప్రకారం తెలంగాణా ప్రాంతా లలో కౌలుభూమి, మొత్తంభూమి విస్తీర్ణంలో 16 శాతం. అంటే ఆంధ్ర ప్రాంతంలోకంటె ఎక్కువే. ఐనా, ఈ ప్రాంతంలోకూడా భూమిలో సింహభాగం అధికభాగం సొంతవ్యవసాయం క్రిందనే సాగుచేయ బడుతున్నది. తెలంగాణా ప్రాంతంలోకూడా భూ ఖామందులలో అధిక సంఖ్యాకులు కొద్ది భూవసతి కలవారే. ఇక్కడి మొత్తం కమతాలలో 93 శాతం సంవత్సరానికి రు. 800 లేక అంతకు తక్కువ ఆదా యాన్ని మాత్రమే సమకూర్చగలిగి 'నటువంటివి. ఈ సంఖ్యల వివరాల పరిశీలనవల్ల మన రాష్ట్రంలో సొంతవ్యవసాయం చేసుకునే రైతులు ఎక్కువగా ఉన్నట్లు స్పష్టమవుతున్నది. ఇది మనరాష్ట్రంలోని వ్యవసాయిక వ్యవస్థయొక్క స్థూలస్వరూపం.

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో భూసంస్కరణలకు సంబంధించి తీసుకోబడిన చర్యలన్నీ చాలవరకు రైత్వారీ పద్ధతి అమలులోని ప్రాంతాలకు మాత్రమే పరిమితమైనవి. 1908 లో ఎస్టేట్ల భూమిచట్టం చేయబడింది. ఈచట్టం ఎస్టేట్లలోని భూఖామందు లకూ, కౌలుదార్లకూ మధ్యగల సంబంధాలను క్రమబద్ధం చేయుటకై ఉద్దేశించ బడింది. 1936 లోనూ, మళ్ళీ 1945 లోనూ, మరికొన్ని తరగ తుల యీనాంగ్రామాలకుకూడా వర్తించే విధంగా "ఎస్టేటు" పదనిర్వచనం విశాలం చేయబడింది. స్వాతంత్ర్యసాధన అనంతరం, యీ మధ్యరకపు టెన్యూరు గ్రామాలకు సంబంధించిన భూసంస్కరణ చర్యలు త్వరితగతిలో తీసుకోబడినవి. శిస్తు తగ్గింపు చట్టము, ఎస్టేట్లరద్దు చట్టము యీ ఉద్దేశముతోనే చేయబడినవి. ఇందులో మొదటిచట్టము ననుసరించి ఎస్టేటు గ్రామాల రైతులు చెల్లించే శిస్తులు, పరిసర ప్రాంతాలలో రైత్వారీ విధానము అమల్లోగల గ్రామాలలోని స్థాయికి తగ్గించటానికి ఉద్దేశించ బడింది. పోతే రెండవచట్టము జమీందారీలను పూర్తిగానూ, యీనాం ఎస్టేట్లను చాలవరకు రద్దు

చేసి వాటిని రైత్వారీ పద్ధతిలోనికి మార్చుటకు ఉద్దేశించబడినది. ఈచట్టములు చేయుటవల్ల వేలాది ఎస్టేటు రైతులు భూఖామందులకు అధికశిస్తు చెల్లించవలసిన అవసరంపోయి, రైత్వారీ గ్రామాల రైతుల స్థాయిలోనికి చేర్చబడినారు. ప్రస్తుతం వారందరూ, మామూలు రైత్వారీరేట్లనే ప్రభుత్వానికి చెల్లించవలసి వుంటుంది.

## ప్రస్తుతం అమలులోవున్న శాసనాలు

మధ్యదళారీ వ్యవస్థను యెత్తివేయుటకు, రాష్ట్ర మంతటా ఒకే విధమైన వ్యవసాయక పరిస్థితులను రూపొందించే కృషిలో యిటీవలనే రెండు చట్టములు 1955 సం.పు. మద్రాసు ఎస్టేటు భూముల ఆంధ్ర సవరణచట్టం, 1956 సం.పు. ఆంధ్ర యీనాముల రద్దు, రైత్వారీలోనికి మార్పు చట్టం - చేయుట ద్వారా మరొక మెట్టు ముందుకు పోవటం జరిగింది. మొదటి చట్టంద్వారా ఎస్టేటు పద నిర్వచనమును విపులీకరించి, కొన్ని తరహాల మార్జినల్ యీనాములు కూడా చేరునట్లు చేయబడి వాటికి కూడా శిస్తు తగ్గింపుచట్టం అమలుపరిచే అవకాశం కల్పించబడింది. కొంతవరకు ఎస్టేట్ల రద్దు చట్టం కూడా వాటికి వర్తించే అవకాశం కూడా కలిగింది. రెండవ చట్టంద్వారా, ఎస్టేట్లు కాని అన్ని యీనాములను రద్దుచేసి, వాటిని రైత్వారీ విధానము క్రిందికి మార్చుట జరిగినది, ఇప్పటికీ ఎస్టేట్లరద్దు చట్టంక్రిందికి రాని కొన్ని తరహాల యీనాములను కూడా రద్దు చేసేవిషయం ప్రభుత్వ ఆలోచనలో ఉన్నది. ఇది కూడా జరిగితే, ఆంధ్ర ప్రాంతంలో మధ్యదళారీ వ్యవస్థ పూర్తిగా రద్దు అయినట్లే.

పైన పేర్కొనబడిన చర్యలన్నీ జమీందార్లకూ, కొన్ని యీనాము ప్రాంతాలకూ మాత్రమే వర్తిస్తున్నవి. కాని రైత్వారీ ప్రాంతాలలోని భూఖామందులకూ, కౌలుదార్లకు మధ్యగల సంబంధాలను గురించి శాసనాలేమీ చేయబడలేదు. ఇప్పటివరకూ యీ సంబంధాలు, ఆచారాలు, అలవాట్లు, అగ్రిమెంట్లు, కంట్రాక్టుల ద్వారానే నిర్వహింప బడుతున్నవి' ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన కొన్ని నెలల తర్వాత భూసంస్కరణల సమస్యను యితర విషయాలను ప్రస్తుత పరిస్థితులు, అవసరాలదృష్ట్యా పరిశీలించి వాటిని గురించి తగు సలహాలు యిచ్చేనిమిత్తం, డాక్టర్ లక్కరాజు సుబ్బారావు అధ్యక్షత క్రింద ఒక భూసంస్కరణల సంఘాన్ని ప్రభుత్వం నియమించింది. 1955 చివరలో యీ సంఘంవారు తమ నివేదికను ప్రభుత్వానికి సమర్పించారు. ఈ నివేదికలో భూసంస్కరణలకు, దానికి సంబంధించిన యితర విషయాలమీద అనేక సిఫార్సులు చేయబడినవి. నివేదికను జాగ్రత్తగా పరిశీలించిన అనంతరం, కౌలు వ్యవహారాల సంస్కరణలకు సంబంధించిన శాసనాలు ముందుగా చేయబడాలని ప్రభుత్వం నిశ్చయించింది. తత్ఫలితంగా ఆంధ్ర టెనన్సీ చట్టము చేయబడింది. ఈ చట్టం ముఖ్యంగా కౌలుదార్లు భూఖామందులకు చెల్లించవలసిన కౌలు మొత్తములను క్రమబద్ధము చేయుటకునూ, వ్యవసాయ కౌళ్ళకు ఒక కనీస కాల పరిమితి విధించుటకునూ ఉద్దేశించబడింది. భూమిని బట్టి, పైరునుబట్టి మొత్తం పంటలో 28¼ నుండి 50 శాతంవరకుగల గరిష్టరేట్లు నిర్ణయింపబడినవి. అంతేకాక ప్రస్తుతపు కౌళ్ళు మూడేండ్లకు తక్కువ కాకుండా అమల్లో వుండాలనీ, ఇకముందు కౌలుకు యిచ్చే భూముల కౌళ్ళు కనీసం 6 సంవత్సరాల పరిమితివరకు ఉండాలనీ శాసనము చేయబడినది. ఈ చర్యలవల్ల కౌలుదార్లకు చాలా ప్రయోజనాలు కల్గుతున్నవి. అంతేకాకుండా వారికీ, భూఖామందులకూ మధ్యఉండే సంబంధాలను పటిష్టమైన పద్ధతిలో నిర్మించటానికి కూడా యీ చర్యలు దోహదం చేయ గలుగుతున్నవి.

ఉమ్మడి హైదరాబాదు రాష్ట్రంలో, రాష్ట్ర విచ్ఛిత్తికి పూర్వం, అనేక భూ సంస్కరణ చర్యలు అమలుపరచబడినవి. జాగీర్లు, యీనాములరద్దు, కౌలు మొత్తాలను క్రమబద్ధము చేయుట, కౌలుదార్లకు స్వాధీన హక్కుల ప్రదానం, గరిష్ఠ ప్రమాణాల విధింపు, భూమి చిన్న చిన్న ముక్కలు కాకుండా నిరోధించుట, కమతాల ప్రమాణీకరణ మొదలైనవి సదరు చర్యలలో ముఖ్యమైనవి. వీటిలో కొన్ని చర్యలు రాష్ట్రమంతటికీ వర్తిస్తుండగా, కమతాల గరిష్ఠ ప్రమాణాల విధింపువంటి మరికొన్ని చర్యలు, ప్రస్తుతానికి రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలకు మాత్రమే పరిమితమై అమలు జరుగుతున్నవి.

(మిగతా 11 వ పేజీలో)

ఆంధ్రప్రదేశ్‌లో దర్శనీయమైన స్థలాలు :

# తిరుపతి

"ఆ పరంజ్యోతి కుపనిషదర్థమునకు
పేరు పెట్టిర యాంధ్రులు ఎంచి యెంచి
అలజడులవేళ " గో " యని పిలిచినంత
" ఓ " యనుచు పల్కు వెంకన్న యేడుకొండు."

— తిరుపతి వేంకటకవులు.

[సంప్రదాయాలపైనా, పవిత్ర మత గ్రంథాలపైనా విశ్వాసంగల ప్రతి హైందవుడు తన జీవితంలో కనీసం ఒక పర్యాయం తిరుపతివెళ్ళి వెంకటేశ్వరస్వామి దర్శనం చేసుకొని ధన్యుడవుతాడు. భారత దేశంలోని సుప్రసిద్ధ యాత్రా స్థలాలలో తిరుపతి ఒకటి. తిరుపతి వెంకటేశ్వరస్వామిని శ్రీనివాసుడనీ, శ్రీ బాలాజీ అని కూడా అంటారు. ఆంధ్రులకాయన ఆపద మొక్కులవాడు, వడ్డీకాసులవాడు, ఇష్టదైవతము.

చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకాలోని రమణీయ పర్వత ప్రాంతంలో తిరుపతి వున్నది, ఈ పర్వతశ్రేణులు తూర్పు కనుమలలో కర్నూలుజిల్లా మొదలు దక్షిణంగా కడపజిల్లాలోకి వ్యాపించి చిత్తూరుజిల్లాలో అంతమవుతవి. పైనుంచి చూస్తే ఈ కొండలు వంపులతో మలుపులతో పాములాగా కన్పిస్తాయి. కనుకనే ఈ కొండలు శ్రీ మహావిష్ణువు పవళించే ఆదిశేషువుయొక్క శరీరమని భక్తులు విశ్వసిస్తారు. తిరుపతిలో శేషాచలం, వేదాచలం, గరుడాచలం, అంజనాచలం, వృషభాచలం, నారాయణాచలం, వెంకటాచలం అని ఏడు కొండలున్నవి. ఈ ఏడు కొండలు, ఆదిశేషుని ఏడు పడగలని భక్తుల నమ్మకం.]

తిరుపతి అంటే కొండ క్రిందవున్న తిరుపతి పట్టణం, కొండపైవున్న యాత్రాస్థలం "తిరుమలై" కూడా అని అర్థం. ఇది సముద్రమట్టానికి 2800 అడుగుల ఎత్తున వుండి, సంవత్సరం పొడుగునా యాత్రికులు రావడానికి అనువైన శీతోష్ణస్థితిని కలిగి వున్నది. రైలుమార్గంగుండా, రోడ్డు మార్గంగుండా సులభంగా తిరుపతి చేరుకోవచ్చును. దక్షిణ రైల్వేయొక్క మద్రాసు - బొంబాయిలైనుపై రేణిగుంట జంక్షన్ వుంది. ఇక్కడి నుంచి తిరుపతి చేరుకోవచ్చును. గూడూరు - కాట్పాడి మీటర్‌గేజి సెక్షన్‌పై రేణిగుంట జంక్షన్ అవతల "తిరుపతి ఈస్టు" (తూర్పు తిరుపతి) అనే ఒక రైలుస్టేషన్ వున్నది. ఈశాన్య దిశనుంచి ఉత్తర దిశనుంచి వచ్చే యాత్రికులు గూడూరులో బండి మారి రేణిగుంట గుండా తిరుపతి వెళ్ళేబండి ఎక్కవలసి వుంటుంది. దక్షిణంనుంచీ. పశ్చిమోత్తర దిశనుంచీ వచ్చే యాత్రికులు రేణిగుంటలో బండిమారి తిరుపతి ఈస్టుకు పోవలసి వుంటుంది. నైరుతి దిశనుంచి వచ్చే యాత్రికులు కాట్పాడిలో బండిమారి గూడూరు - కాట్పాడి మీటర్‌గేజి బండిలో ప్రయాణం చేయవలెను.

## పౌరాణిక ప్రాముఖ్యం

మన ప్రాచీన సారస్వతంలో తిరుపతికి చాలా పెద్ద ప్రాముఖ్యంవుంది. తిరుమలై ఒకప్పుడు మేరు పర్వతంలో ఒక భాగంగా వుండేదని అంటారు. అయితే ఆదిశేషునికీ వాయువుకూ జరిగిన యుద్ధంలో ఆ పర్వతం బ్రద్దలై



*ఏడుకొండలవాడా! వేంకటరమణా! గోవిందా! గోవింద!*

భూమిపై పడిందట. మరికొందరు ఇది వైకుంఠంలోని క్రీడాచలమని, దీనిని శ్రీ మహావిష్ణువు పనుపుపై గరుత్మంతుడు ఈ లోకానికి తెచ్చాడనీ అంటారు.

తిరుపతి దేవాలయం కూడా బహు పురాతనకాలంనుంచీ ఈ లోకంలో వుంటూన్నదని కొందరి విశ్వాసం. నాల్గు వేదాలలో అన్నిటికంటె ప్రాచీనమైనదగు ఋగ్వేదంలో శ్రీ వెంకటేశ్వరుని ప్రసక్తి కలదనికూడా అంటారు. శ్రీ వేంకటాచల మాహాత్మ్యంలో పన్నెండు మహాపురాణాల కథ లున్నవి. మహాప్రళయం సంభవించడానికి పూర్వమూ, ప్రళయకల్పం తరువాత శ్రీ మహావిష్ణువు శ్వేతవరాహ అవతారమెత్తి ఈ లోకాన్ని రక్షించాడనీ, ఆ తరువాత దుష్టశిక్షణార్థం, శిష్టరక్షణార్థం ఈ లోకంలోనే కొంత కాలం వుండడానికి ఆయన నిశ్చయించుకొని తిరుమలైలో స్వామి పుష్కరిణి తీరంపై ఒకమూల ప్రత్యక్షమైనాడనీ, ఆయన సహధర్మచారిణి తిరుపతికొండకు కొద్దిదూరంలో వున్న తిరుచానూరులో నివాస మేర్పరుచుకొన్నదనీ పురాణములలో చెప్పబడి వున్నది. ఈ శ్వేతవరాహావతారం తిరుమలైలో స్వామి పుష్కరిణి తీర్థానికి పడమటి తీరంపై వున్న ఆదివరాహస్వామి ఆలయంలో ప్రతిష్ఠింపబడింది. ఈ ఆలయం శ్రీ వెంకటేశ్వరస్వామి ఆలయంకంటె పురాతనమైనదనీ, కనుక మొదట ఈ స్వామిని సేవించుకొనవలెననీ అంటారు.

## చారిత్రక ప్రాముఖ్యం

ప్రాచీనకాలంనుంచి కూడా దక్షిణ భారతమును పరిపాలించిన మహారాజులు ఈ దేవాలయమునకు పోషకులుగా వ్యవహరించారు. పల్లవ, చోళ, పాండ్యవంశముల రాజులు తమ బొక్కసములలోనుంచి ఈ దేవాలయ నిర్వహణకు పెద్దమొత్తా లిచ్చినట్లు ప్రతీతి. ఇక విజయనగర రాజుల దాతృత్వానికి మేరయేలేదు. కృష్ణదేవరాయలు, ఆయన దేవేరుల విగ్రహాలు రాయల పరిపాలన కాలంలోనే ఆలయ ద్వారములముందు ప్రతిష్ఠాపన చేయబడ్డవి. అవి ఇప్పటికి కూడా అక్కడే వున్నవి. విజయనగర సామ్రాజ్య పతనానంతరం కూడా దేశంలోని వివిధ ప్రాంతాల పరిపాలకులు, దండనాయకులు, శ్రీమంతులు దేవాలయమును దర్శించి కానుకలు సమర్పించుకునే వారట. మహారాష్ట్ర సేనాని రఘోజీభోన్‌స్లే ఈ ఆలయమును దర్శించి ఇందులో పూజాదికముల నిర్వహణకై, శాశ్వతంగా ఒక పాలకవర్గాన్ని ఏర్పాటు చేశాడట. అంతేగాక అమూల్యమైన జవాహిరీనీ, ఒకపెద్ద పచ్చనుకూడా వేంకటేశ్వరస్వామికి సమర్పించుకున్నాడట. ఆపచ్చ ఇప్పటికీ రఘోజీ పేరిటవున్న పెట్టెలో పదిలంగా భద్రపరచబడి వుంది. ఆ తరువాత గద్వాల, మైసూరు సంస్థానాల ప్రభువులుకూడా పెద్దపెద్ద కానుకలు సమర్పించారు.

1933లో మద్రాసు శాసనసభ ఒక ప్రత్యేక చట్టాన్ని ఆమోదించడం ద్వారా ఈ దేవాలయ నిర్వహణను తిరు

మలై తిరుపతి దేవస్థానం కమిటీకి అప్పగించింది. ఆచట్టము ననుసరించే ప్రభుత్వ దేవాలయ నిర్వహణకై కమీషనర్‌ను నియమించింది. 1951 సంవత్సరంలో చేయ బడిన మరొక శాసనం అంటే హిందూ దేవాదాయ ధర్మా దాయ చట్టంద్వారా ఆలయ నిర్వహణ ట్రస్టీల బోర్డుకూ ప్రభుత్వంచే నామినేటు చేయబడి నియమింపబడిన ఎగ్జి క్యూటివ్ ఆఫీసరుకూ అప్పగించింది. ఇప్పుడు వీరే ఆలయ నిర్వాహకానికి బాధ్యులై వున్నారు.

## ఆరోహణ

యాత్రికులు కొండపైని తిరుమలై ఆలయానికి చేరు కోవాలంటే మొదట కపిలతీర్థంలో స్నానంచెయ్యాలి. హిందూ వేదాంతంలో సాంఖ్యశాస్త్రానికి కర్తయైన కపిల మహర్షి పేరిట ఈతీర్థం వ్యవహరింప బడుతున్నది. ఈ తీర్థంలో స్నానంచేసిన తరువాత యాత్రికులు కొండ ఎక్కుతారు. కొండ ఎక్కేదారిలో విద్యుద్దీపాలు ఏర్పాటు చేయబడ్డవి. ఏడుకొండలెక్కిన తరువాత వెంకటేశ్వర స్వామి ఆలయం చేరుకుంటారు. ఇంతకుపూర్వం దారి సరిగా వుండేదికాదు. కాని కొన్నేండ్లక్రిందట చక్కని మోటారురోడ్డు వేయబడింది. ఈరోడ్డుపై ఎగువ తిరు పతికీ, దిగువ తిరుపతికీ బస్సులు నడుస్తున్నవి.

## గోపురములు

కొండమె పైకెక్కుతూవుంటే దారిలో రెండు దేవాలయా లున్నవి. మొదటిది నరసింహస్వామి ఆలయం. ఇది కొండకు దిగువనుంచి నాలుగుమైళ్ళ దూరంలో వున్నది. రెండవది శ్రీ రామానుజ దేవాలయం, దానిలో రెండు ముఖ్యమైన గోపురాలుకూడా వున్నవి. ఒకటి అలిపిరి గోపురం, రెండవది గాలిగోపురం. కొండశిఖరాన వెయ్యి స్తంభాల మంటపం వుంది. అయితే చాలాకాలం నుంచీ ఇది ఉపయోగింప బడటంలేదు. అందుచేత దేవస్థానం అధికార్లు దీనిని విభజించి యాత్రికుల సౌకర్యం కోసమై సత్రంగా మార్చారు.

## చక్కని కట్టడం

తిరుపతిలోని ప్రధాన దేవాలయం, తూర్పుముఖంగా వున్నదాని గోపురాలు దక్షిణ భారతదేశం మొత్తంలోనే శిల్ప విన్నాణానికి చెప్పుకోదగివున్నవి. దేవాలయ గర్భగుడి విమానానికి పూర్తిగా బంగారు తాపడం చేయబడింది. దీనిని "ఆనంద నిలయం" అంటారు. దేవాలయానికి మూడు ప్రాకారాలున్నవి. మొదటిప్రాకారంలో ధ్వజస్తంభం వున్నది.



ఆలయ గోపురం దృశ్యం.

గర్భగుడిలోకి ప్రవేశించగానే శ్రీ వేంకటేశ్వరస్వామి విగ్రహం కన్పిస్తుంది. విగ్రహం చూడటానికి ప్రస్ఫుటంగా మహిమాన్వితంగా కన్పిస్తుంది. హైందవ ప్రతిమావర్ణన శాస్త్రసూత్రాల ప్రకారం శ్రీ వెంకటేశ్వరస్వామి విగ్రహంలో హరిహరుల గుణములు రెండూ సమ్మేళనం చెందివున్నవి. కనుకనే శైవులు, వైష్ణవులూ ఈ స్వామిని ఆరాధిస్తారు. విగ్రహమునకు నాలుగు చేతులున్నవి. వాటిలో రెండు వెనుకవైపు ఉన్నవి. ఒకచేతిలో శంఖము, రెండవ చేతిలో చక్రమూ వున్నవి. ముందటి రెండుచేతులలో ఒకటి అభయముద్రలో వుంది. రెండవచేయి నడుముపై వున్నది. ముందటి రెండుచేతులపై భుజంగవలయం వున్నది.

## పవిత్ర తీర్థములు

దేవాలయం ప్రక్కనవున్న స్వామి పుష్కరిణి పెద్ద తటాకం. యాత్రికులు ఆలయంలో ప్రవేశించేముందు దీనిలో స్నానం చేస్తారు. పురాణాలలో ఈ తీర్థ పవిత్రతను గూర్చిన ప్రసక్తి కలదు.

కొండపై కొన్ని జలపాతాలున్నవి. వీటికి మత విషయకంగా ఎంతో ప్రాధాన్య మున్నది. ఈ జలపాతాలలో "పాపవినాశం," "ఆకాశగంగ" "గోగర్భతీర్థం" ప్రసిద్ధి జెందినవి.

## దిగువ తిరుపతి

కొండపైన వెంకటేశ్వరస్వామిని సేవించుకొన్న తరువాత యాత్రికులు తిరుపతి పట్టణం చేరుకుంటారు. ఈ పట్టణంలో కూడా దర్శించవలసిన దేవాలయాలెన్నో వున్నవి. వాటిలో శ్రీ గోవిందరాజస్వామి ఆలయం ప్రసిద్ధి జెందినది. ఇది రైలుస్టేన్‌కు సమీపంలో వున్నది, గోవిందరాజస్వామి ఆలయంలో శ్రీ ఆండాళ్ ఆలయం వున్నది. గోవిందరాజస్వామి ఆలయంలో ప్రతి సంవత్సరం వైశాఖ మాసంలో (మే - జూన్ నెలల్లో) తొమ్మిది రోజులపాటు బ్రహ్మోత్సవం జరుగుతుంది.

పట్టణం మధ్యలో రైలుస్టేషనుకు మూడు ఫర్లాంగుల దూరాన శ్రీ కోదండ రామాలయం వుంది.

పట్టణానికి $1\frac{1}{2}$ మైళ్ళ దూరంలో కొండదిగువన కపిలేశ్వరాలయం వుంది. అక్కడే కపిలతీర్థ మనే రమణీయమైన జలపాతం వున్నది. దీనిని ఆళ్వార్ తీర్థమనికూడా అంటారు. ఎందుచేతనంటే తటాకానికి దక్షిణంవైపున నమ్మాళ్వార్ ఆలయం వున్నది. కొండలపైకి వెళ్ళేముందు ప్రతి యాత్రికుడు ఇందులో స్నానంచేస్తాడు. వర్షర్తువులో కొండలపైనుండి జలధార చెరువులో పడుతూవుంటే ఆదృశ్యం నేత్ర పర్వంగా వుంటుంది.

## తిరుచానూరు

యాత్రికులు తిరుపతిలో దేవాలయాలను సందర్శించిన తరువాత తిరుచానూరు వెడతారు. అది తిరుపతికి దక్షిణం వైపు మూడుమైళ్ళ దూరంలో వున్నది. తిరుపతినుంచి తిరుచానూరుకు బస్సుసర్వీసు వున్నది. తిరుచానూరు ఆలయంలో శ్రీ పద్మావతి ప్రతిష్ఠితమైనది. శ్రీ పద్మావతి శ్రీ వెంకటేశ్వరస్వామి పత్ని అని పురాణాలలో చెప్పబడి వున్నది. పద్మావతీదేవి ఆలయం ప్రక్కవున్న తటాకంలోని ఒక పద్మంపై ఆమె దర్శనమిచ్చిందనీ కనుకనే ఆ తటాకానికి పద్మసరోవరమని నామకరణం చేయబడిందనీ పురాణాలలో చెప్పబడి వున్నది. పద్మావతీదేవి జన్మదినోత్సవం బ్రహ్మోత్సవంనాటి తొమ్మిదవ రోజున జరుపబడుతుంది.

తిరుచానూరులోని దేవి ఆలయంలో ఎట్టి ఆడంబరమూ, ఖర్చులూ అక్కరలేకుండా పెండ్లి జరిపితే మిక్కిలి శుభప్రదమని హిందువులలో ఒక విశ్వాసం కలదు. కనుకనే సంవత్సరం పొడుగునా ఈ ఆలయంలో అసంఖ్యాకంగా పెండ్లిండ్లు జరుగుతూ వుంటాయి. అదొక పెద్ద పెండ్లి పందిరి.

తిరుచానూరు అనేపేరు ఎలావచ్చిందంటే- మొదట దానికి శుకమహర్షి పేరిట "తురుశుకనూరు" అని పేరు పెట్టబడింది. అక్కడ శుకమహర్షి తపస్సు చేశాడట. ఆ తరువాత క్రమంగా అది "తిరుచానూరు" అని వ్యవహరింపబడింది.

## సౌకర్యాలు

యాత్రికులు తిరుపతి చేరినవెంటనే తిరుపతి ఈస్టు రైలుస్టేషనుకు కొన్నిగజాల దూరంలోనేవున్న దేవస్థానం సత్రానికిగాని కొత్త సత్రానికిగాని వెళ్ళవచ్చు. అక్కడ వుండడానికి అన్ని సదుపాయాలూ వున్నవి. తిరుపతి పట్టణంలో ఒకపగలు లేదా ఒకరాత్రి వుండదలచు కున్నవారు ఈ సత్రంలోగాని లేక తిరుమలై కొండలకుపొయ్యే దారిలో వున్న "పుష్పతోట్టేన్" సత్రంలోగాని వుండవచ్చు. ఈరెండు సత్రాలలో నివాసవసతి ఉచితం. కొత్తసత్రంలో అన్నిసౌకర్యాలూ కలవు. అది రైలుస్టేషన్‌కు దగ్గిరగా

కూడా వుంటుంది. దేవస్థానం బస్సుసర్వీసులకు ఇది ఆఖరి మజిలీ. ఇక్కడినుంచి ఉదయం మొదలు రాత్రివరకూ దేవ స్థానం బస్సులు యాత్రికులను కొండపైకి చేరవేస్తూ వుంటాయి.

కొండపైకి వెళ్ళదలచుకున్నవారు ప్రయాణం విష యమై ఏమైనా తెలుసుకొన గోరితే ఎంక్వయిరీ ఆఫీసులో గాని, లేదా సత్రం సూపరిండెంటెంటుతోగాని సంప్రదించ వచ్చు. అక్కడ యాత్రికులకు అవసరమైన సమాచారం తెలియజేయ బడుతుంది. .

తిరుమలై చేరుకున్న తరువాత యాత్రికులు నేరుగా దేవస్థానం ఎంక్వయరీ ఆఫీసుకుపోయి అక్కడి అధికారు లతో మాట్లాడి వసతి సౌకర్యాలను ఏర్పాటు చేసుకోవచ్చు. కొండపైన దేవస్థానంవారి సత్రములున్నవి. నివాసస్థలాలన్ని టిలో విద్యుద్దీపాలు అమర్చబడ్డవి. చక్కని మంచినీటి సర ఫరాకూడా వున్నది. దేవస్థానంవారి కో ఆపరేటివ్ స్టోర్సులో కిరాణా సరకులను కొనుక్కోవచ్చు. దేవస్థానం వారి సత్రాలేగాక పిఠాపురం, మైసూరు మహారాజులు కట్టిం చిన సత్రాలుకూడా వున్నవి. దేవస్థానంవారి అధీనంలో ఒక ట్రావెలర్స్‌బంగళా, ఒక దివాణంకూడా వున్నవి. యాత్రి కుల సౌకర్యార్థమై దేవస్థానంవారు యాత్రికుల గైడ్స్‌వ్రీ సును ఏర్పాటు చేశారు.

ఇక్కడి రమణీయదృశ్యాలు, జలపాతాలు, నిర్మలమైన వాతావరణం, ఆరోగ్యకరమైన కొండలగాలి - వీటన్నిటి వల్ల తిరుపతిక్షేత్రం సంవత్సరం పొడుగునా యాత్రికులకు అనువైన ప్రదేశంగా వున్నది. ఈ పుణ్యస్థలానికి ఎల్లప్పుడూ దేశంలోని నలుమూలలనుంచి యాత్రికులు వస్తూవుంటారు కనుకనే "తిరుపతిలో నిత్యం పర్వదినంగానే వుంటుంది" అనే ఖ్యాతి కలిగింది.

"అమరవరులకు వైకుంఠ మైనకొండ
ఆళువార్లకు ప్రత్యక్ష మయిన కొండ
అరసిచూచిన బ్రహ్మాండమైన కొండ
నేను పొడగంటి శ్రీ వేంకటేశు కొండ"

— కీ॥ శే॥ శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి



---

★ వ్యవసాయోత్పత్తి పెరిగేవిధంగా భూ సంస్కరణలు అమలు జరగాలి ★

(6 వ పేజీ తరువాయి)

### భూసంస్కరణలు, వ్యవసాయోత్పత్తి

భూ సంస్కరణల విషయంలో మరికొన్ని చర్యలు తీసుకునే విషయం ప్రభుత్వ ఆలోచనలో వున్నది. ఈ చర్యలు తీసుకొనుటలో, ఇంతకు పూర్వం వ్యవసాయానికి సంబంధించి సేకరించబడిన సంఖ్యావివరాలు చాలావరకు సహాయకారు లవుతవి. వచ్చే 5 ఏండ్ల కాలంలో వ్యవసాయోత్పత్తిని చాలా ఎక్కువ చేయాలని రెండవ ప్రణాళికలో నిర్దేశింప బడింది. కనుక భూ సంస్కరణలు ఏవిచేసినా యీ దృష్టితోనే చేయవలసి వుంటుంది. ప్రణాళికా విజయానికి అధికోత్పత్తి అత్యవసరం. అందువల్ల ఉత్పత్తిని అధికము చేయుటకై కావలసిన ఉత్సాహాన్ని రేకెత్తించవలసి ఉంటుంది. కనుక భూ సంస్కరణలు, భూమిపై హక్కు, ప్రయోజనాలను న్యాయదృష్టితో క్రమపరచటమే కాకుండా, వ్యవసా యోత్పత్తులను అధికముచేసే ఉత్సాహాన్ని కూడా కలుగజేసే స్వభావాన్ని కలిగి ఉండాలి. ప్రణాళికా సంఘంవారు సూచించినట్లు, యీ విషయంలో రెండు ప్రధానాంశాలు యిమిడి ఉన్నవి. ఒకటి "వ్యవసాయోత్పత్తుల దృక్పథం" రెండు "భూమి మీద వివిధవర్గాలకు కలహక్కులు, ప్రయోజనాలతో కూడిన దృక్పథం". *ఈ రెండు దృక్పథాలమధ్యా సిద్ధాంత సంబంధమయిన సంఘర్షణ లేకపోయిననూ, రెంటికీ సమాన ప్రాధాన్యము, సమన్వయం కల్పించ గల చర్యలవల్లనే భూసంస్కరణలపథకాలు ప్రయోజన కర మవుతాయి.*

# విశాఖపట్నం

దర్శనీయమయిన స్థలాలూ, చూచి ఆనందించవలసిన విశేషాలూ విశాఖపట్నంజిల్లాలో ఎన్నో వున్నవి. భీమునిపట్నం బీచీ, సింహాచలం దేవాలయం, శంఖారం బౌద్ధ అవశేషాలు, అరకులోయ, మచ్‌కండ్ ప్రాజెక్టు, ధింసా నృత్యం— ఇవన్నీ ఈ జిల్లాలో తప్పక చూడ వలసిన విశేషాలు.

ఇక్కడి చల్లనిగాలి, ఆరోగ్యకరమైన వాతావరణం, సుందరమయిన దృశ్యాలు ఎవరినయినా ఇట్టే ఆకర్షిస్తాయి.

విశాఖపట్నంజిల్లా తూర్పుకోస్తా పైభాగంలో వున్నది. ఈ జిల్లాలో ఉత్తరాన, పడమటా రెండు పెద్దకొండ ప్రదేశాలున్నవి. కొండలు చాలావరకు అడవులతో కప్ప బడి వుంటాయి. ఈ కొండప్రాంతాలలో నివసించే ప్రజలు నవనాగరికత లేక ఇంకా వెనుకబడి వున్నారు. దీన్ని "ఏజన్సీ" ప్రాంతమని అంటారు. కొన్నిప్రత్యేక చట్టాలతో ఈ ఏజన్సీప్రాంతం పరిపాలింప బడుతున్నది. ఒకప్పుడు ఏజన్సీ ప్రాంతంలో అడవి దున్నలు, ఎనుబోతులు, సాంభర్, చిరుతపులులు, పెద్దపులులు వుండేవి. ఇప్పటికీ కూడా వేటాడువారికి ఈ అడవు లెంతైనా తగివున్నవి. ఇక్కడి కొండలు సాధారణంగా చెల్లాచెదురుగా వుంటాయి. కాని కొన్నిచోట్ల బారులుతీరి వుంటాయి. వాటినిచూస్తే పెద్ద పెద్ద రాక్షసుల సమూహం నిశ్శబ్దంగా ఏదో వ్యూహంపన్ని వరుసలుతీరి పోతున్న ట్లనిపిస్తుంది. జిల్లాలో అన్నికొండల కంటె ఎత్తైనది గాలికొండ. దానిఎత్తు 5,300 అడుగులు. సముద్ర తీరంవెంట ఉప్పునేలలు, ఇసుకతోనిండిన చిత్తడి నేలలు కన్పిస్తాయి. అయితే కోస్తాఅంతా ఒకేవిధంగా లేదు. కొన్నిచోట్ల వొట్టిమైదానాలు, కొన్నిచోట్ల సముద్ర ములో లోపలికి చొచ్చుకొనిపోయిన అగ్రములు, మరికొన్ని ఉన్నత ప్రదేశాలు ఉన్నవి. ఇవి సముద్రపు అలలు తీరాన్ని కోయకుండా రక్షణగా వున్నవి. వీనిలో పోలవరం శిల, విశాఖపట్నంలో డాల్ఫిన్స్ నోస్, వాల్తేరువద్ద లాసన్ తీరానికి ఉత్తరానవున్న ఋషికొండ, భీమునిపట్నంవద్ద నరసింహకొండ ముఖ్యంగా పేర్కొనదగినవి.

## ప్రయాణీకులు దర్శించవలసిన స్థలాలు

*విశాఖపట్నం* : ఇది జిల్లా ప్రధానకేంద్రం. దీనికీపేరు అంగారక గ్రహంయొక్క అంశతో జన్మించిన కార్తికే యుడు లేక వైశాఖుడు (కుమారస్వామి) పేరిట కలిగిందని ప్రతీతి. కొన్ని శతాబ్దాల క్రిందట ఆంధ్రవంశానికి చెందిన ఒకరాజు కాశీకి వెళ్ళుతూ దారిలో ఈ పట్టణం ప్రక్కన విడిది చేశాడట. అప్పుడాయన ఇక్కడి సౌందర్యానికి ముగ్ధుడై తన అభిమాన దైవమైనట్టి వైశాఖునిపేరిట ఒక ఆలయం కట్టించాడట. అయితే సముద్రం భూమిలోపలికి చొచ్చుకొని రావడంచేత కాబోలు ఇప్పుడీ ఆలయం కన్పించదు.

17 వ శతాబ్ది మధ్యభాగంలో ఈస్టిండియా కంపెనీవారు విశాఖపట్నంలో ఒక ఫ్యాక్టరీ స్థాపించారు. ఆ తరువాత ఈ పట్టణం బాగా పెరిగి జిల్లా ప్రధానకేంద్ర మయింది.

పట్టణం సముద్రతీరాన అయిదుమైళ్ళ పొడవున నిర్మింప బడింది. పట్టణానికి దక్షిణాన 1500 అడుగుల ఎత్తుగల తిన్నె ఒకటి సముద్రంలోకి చొచ్చుకొని పోయివుంది. దీనిని నావికులు "డాల్ఫిన్స్‌నోస్" అని అంటారు. ఉత్తరంవైపున లాసన్‌తీరం వుంది. ఈత అలవాటువున్న వారికి ఇది చాలా అనువైన స్థలం. లాసన్ తీరానికి దక్షిణమున వాల్తేరు వున్నది. ఇది పట్టణ మునిసిపాలిటీకి ఉత్తరపు చివర. వాల్తేరు ఎగుడు దిగుడుగావున్న ప్రదేశంలో వున్నది. సముద్రమట్టానికి ఇది 250 అడుగుల ఎత్తుదాకా వుంటుంది. ఈ ప్రదేశంలో చక్కని నివాసగృహములున్నవి. అంతే

గాక భారతదేశం మొత్తంలోనే పేరెన్నికగన్నట్టి ఆంధ్ర విశ్వవిద్యాలయంకూడా ఇచ్చటనే వున్నది. వాల్తేరు అప్ ల్యాండ్సు నుంచి చూస్తే కన్పించేదృశ్యం భారతదేశపు తూర్పుకోస్తా మొత్తానికి మిక్కిలి అందమైన దృశ్యమని చెబుతారు. ఒకవైపు డాల్ఫిన్స్‌నోస్ ధూమ్రవర్ణం, విశాఖ పట్నం అవతల కొండపై కన్పించే పసిమిరంగు ఇసుక తిన్నెలు, ఏటవాలుగావుండే భూములపై పచ్చని చెట్లు చేమలు, పచ్చని త్రాటిచెట్లు, సముద్రతీరానవుండే ఎర్రని భూమి, తీరానికి ఉత్తరపు చివరన నల్లగా కన్పించే చెట్ల సమూహం - ఈ దృశ్యం చూచి తీరవలసిందే. వాల్తేరు ఆరోగ్యకరమైన శీతోష్ణస్థితిగల ప్రదేశం అవడంచేతనూ ఇచటి దృశ్యాలు మనోహరంగా వుంటాయిగనుకనూ. హైద్రాబాదు రాజధాని అయిన తరువాతకూడా ఆంధ్రప్రదేశ్ గవర్నర్‌కు ఇది వేసవి మకాంగా వుంటున్నది. గవర్నరు ఇక్కడ వుండనికాలంలో వేసవి విడిదిలోని ఒక భాగం సర్క్యూట్ హౌస్‌గా ఉపయోగింప బడుతుంది.

ఆయేటి కాయేడు విశాఖపట్నం ప్రాముఖ్యం హెచ్చు తున్నది. డాల్ఫిన్స్‌నోస్‌కు సమీపంగావున్న రేవు ఆంధ్ర కోస్తాలో చాలా పెద్దది. ఇప్పుడిక్కడ విస్తృతీకరణ కార్యక్రమం అమలు జరుగుతున్నది. సర్కార్సు నావల్ బేస్ ఈ రేవుకు దగ్గరగావున్నది. నౌకాదళం వుండడంచేత పట్టణసాంఘిక జీవితం మరింత శోభాయమానంగా వుంటు [illegible]

వున్నది. ఈరోడ్డు ఎగుడు దిగుడుగా వున్నప్పటికీ చక్కగా బ్లాకుటాప్ వేయబడివుంది. భారత దేశంలోని పురాతనమైన మునిసిపాలిటీలలో భీమునిపట్నం ఒకటి. ఇది నరసింహ కొండకు దిగువన చిట్టివలస నది ముఖద్వారంపై వున్నది. 17వ శతాబ్దిలో డచ్చివారు భీమునిపట్నంలో ఒకకోట, ఒక ఫ్యాక్టరీ నిర్మించారు. అప్పటినుంచి భీమునిపట్నం డచ్చి వారి స్థావరంగా ప్రసిద్ధి జెందింది. ఆకోట ఇప్పుడులేదు. కాని దాని ధ్వజస్తంభ స్థావరం, ఇటుకలతో కట్టిన మరొక కట్టడం ఇప్పటికీ మిగిలివున్నవి. ధ్వజస్తంభం సముద్రానికి ఎదురుగావుంది. ఆ ఇటుకల కట్టడం బహుశా మందు గుండు సామగ్రిని నిలువజేసిన కొట్టు అయివుంటుంది. డచ్చి వారు దీనిని విడిచిపెట్టి వెళ్ళిన తరువాత పట్నం క్షీణించి పోయి 1846 వరకు అలాగేవుంది. ఆ తరువాత స్థానిక ఉత్పత్తులకు, ముఖ్యంగా నూనెగింజలు, జనుముకు ఎగుమతి గిరాకీ కలుగడంతో పట్నం మళ్ళీ వృద్ధిచెందింది. అయితే విశాఖపట్నం పెద్ద రేవుకేంద్రంగా అభివృద్ధి చెందడంచేత భీమునిపట్నం రేవు ప్రాముఖ్యం తగ్గిపోయింది. అయితే భీమునిపట్నం బీచిమాత్రం చూడదగింది. బహుశా తూర్పు కోస్తాలోనే ఇంతటి అందమైన బీచిలేదు. సముద్రంలో స్నానం చేయదలచు కొన్నవారికి ఇది మిక్కిలి అనుకూల మైన తావు. ఇక్కడ నీటిలో ప్రమాదకరమైన లోతులు, [illegible]

*విజయనగరం* ; విశాఖపట్నం జిల్లాలో విజయనగరం రెండవ పెద్దపట్టణం. ఇది విజయనగరం రాజాలకు రాజధానిగా వుంటూ వచ్చింది. మొగలు సామ్రాజ్య పతనానంతరం ఆ సామ్రాజ్యపు దక్షిణభాగాలలో అరాజకం ప్రబలిన సమయంలో విజయనగరం పెద్ద జమీందారీగా వుండేది. విజయనగరంలో పెద్ద కోటవున్నది. దీనిని చూస్తే విజయనగరవంశపు పూర్వవైభవం కన్పట్టుతుంది. కోటచుట్టూ పట్టణం పెరిగింది. కోటకు ఎడమవైపున పూర్వపు కంటోన్మెంటు, సివిల్‌స్టేషను వున్నవి. వీటి రెండింటి మధ్య పెద్ద చెరువున్నది. ఈ చెరువులో ఎల్లప్పుడు నీరు వుంటుంది. చెరువుక్రింద పచ్చని అందమైన వరిచేలుంటాయి. పక్షుల వేటకు ఈ ప్రదేశం చాలా అనువైనది. సివిల్‌స్టేషన్, కంటోన్మెంటుల నిర్మాణం ఒక క్రమం ప్రకారం జరిగింది. ఇవి చాలా పరిశుభ్రంగా వుంటాయి. పడమటివైపున ఒక ఎత్తైన మైదానంకలదు. ఇప్పు డిది పోలీసు పెరేడ్‌గ్రౌండుగా ఉపయోగింప బడుతున్నది. ఈ మైదానానికి ఒకప్రక్కన ఎంతో కాలంనుంచి వుంటూవున్న పెద్దపెద్ద వృక్షములు, రెండవప్రక్కన బంగళాలవరుసలు, మిలిటరీ అసుపత్రి కలవు. పెరేడుగ్రౌండుకు ఒకవైపున రెండువైపులా చెట్లుగల రోడ్డు ఒకటి వున్నది. ఆ రోడ్డు గుండా వెళ్ళితే సేంట్‌మారిస్ రోమన్ కేతలిక్ చర్చీ వస్తుంది. విశాఖపట్నానికి పొయ్యే రోడ్డుపై ఇప్పుడు నిరుపయోగమైపోయిన రేస్‌కోర్సు, గ్రాండ్‌స్టాండ్, ఎప్పటిదో పాత విమానాశ్రయం, గుఱ్ఱపుశాలలతాలూకు గోడలు వున్నవి. విజయనగర వంశం పరిపాలిస్తున్న కాలంలో ఈ గుఱ్ఱపుశాలలలో మేలుజాతి అశ్వము లుండేవట. ఈ రోడ్డున్నేపడి 35 మైళ్ళు పోతే జిల్లా ప్రధాన కేంద్రమైన విశాఖపట్నం వస్తుంది. దక్షిణరైల్వేలో కలకత్తా - మద్రాసు ప్రధాన మార్గంపై విజయనగరం ఒక చిన్న జంక్షన్.

*సింహాచలం* ; విశాఖపట్నంనుంచి 10 మైళ్ళ దూరాన సింహాచలంవుంది. ఈ పదిమైళ్ళు రోడ్డుమార్గం వుంది. సింహాచలం అఖిలభారత ప్రశస్తిగల యాత్రాస్థలం. కాశీ తిరుపతి మొదలగు యాత్రాస్థలాలతో ఇది సమానమయినది. సింహాచలం ఆలయము సముద్ర మట్టానికి 800 అడుగుల ఎత్తునవున్న ఒక కొండపై వున్నది. ఇదినృసింహస్వామి ఆలయం, దీని నిర్మాణాన్ని గూర్చిన స్థల పురాణం ఈ విధముగా వున్నది. హిరణ్య కశ్యపుడను రాక్షసునికి అతని కుమారుడు ప్రహ్లాదుడు శ్రీ మహావిష్ణువు భక్తుడు కావడము ఇష్టంలేదు. శ్రీ మహావిష్ణువును భజించవద్దని అతడు తన కుమారునితో ఎన్నోమార్లు చెప్పాడు. కాని పరమభక్తుడైన ప్రహ్లాదుడు ఆ మాటలువినలేదు. అంతట హిరణ్యకశ్యపుడు కుమారునిపై ఆగ్రహోదగ్రుడై అతనిని సముద్రంలో పడవేయించాడట. సింహాచలం కొండను ఆ బాలుని నెత్తిమీద పెట్టించాడట. అప్పుడు విష్ణువు నరసింహావతార మెత్తి ఆ కొండకు ఒక ప్రక్కన నిల్చొని దానిని ఒకచేత పట్టుకొని వుంచగా ప్రహ్లాదుడు మరొకప్రక్కనుంచి ప్రాకిపోయి ప్రాణములను దక్కించుకొన్నాడట. ప్రహ్లాదుడే ఆతరువాత సింహాచల ఆలయమును కట్టించినాడనిప్రతీతి. ఈఆలయం ఏ యుగమునకు చెందినదో .సరిగా తెలీదు. కాని దీనిపై క్రీ॥ శ॥ 1099 సంవత్సర ప్రాంతంనాటి కుళోత్తుంగచోళుని శాసనం ఒకటి కలదు. కుళోత్తుంగచోళుడు కళింగదేశాన్ని జయించినవాడు. ఆలయం గోడలపై ఇంకా అనేక శాసనాలున్నవి. వాటినిబట్టి ఈ జిల్లా చరిత్రను తెలుసుకోవడానికి వీలు కలుగుతున్నది. వాటిలో ఒక శాసనం విజయనగర ప్రభువు శ్రీకృష్ణదేవరాయలకు సంబంధించినది. అందులో కృష్ణదేవరాయల విజయ యాత్రలనుగూర్చి చెప్పబడి వుండడమే గాక రాయలవారు ఆయన దేవేరులు 991 ముత్యాలుగల ఒక హారాన్ని, ఇంకా ఇతర కానుకలను స్వాములవారికి సమర్పించినట్లుగా కూడా వివరింపబడి వున్నది.

ఆలయానికి వెళ్ళేదారి ఒక గులాబీ తోటనుంచి కొండ కొనగుండా పోతుంది. దారిలో అనాసచెట్లు, మామిడి పనస మొదలగు వృక్షాలు వుంటాయి. ఆ తరువాత వెయ్యి మెట్లుఎక్కి ఆలయం చేరుకోవాలి. మెట్లకు రెండువైపులా నీడకోసం చెట్లు వేయబడినవి. దారిలో అక్కడక్కడా రాతివిగ్రహా లున్నవి. ఉత్సవాల రోజులలో క్రిందినుంచి పైవరకు మెట్లకు దీపాలంకరణ చేయబడుతుంది. మెట్లు పోయిపోయి చివరకు కొండకొన ముఖ ద్వారంవద్దకు పోతాయి. అక్కడ హనుమంతుడి ద్వారంవుంది. కొండకొననుంచి ఒకవాగు ప్రవహిస్తూవుంది. దానిని రెండు తటాకాలుగా రూపొందించారు. యాత్రికులు కొండపైకి ఎక్కేముందు ఈ తటాకాలలో స్నానంచేస్తారు. ఏడాదిలో 365 రోజులూ దేశంలోని పలు ప్రాంతాలనుంచి యాత్రికులు ఈక్షేత్రాన్ని సందర్శిస్తారు. ముఖ్యంగా వైశాఖ (ఏప్రిల్ - మే) మాసంలో ఎక్కువమంది జనం వస్తారు.

కొండక్రింద, కొండపైన యాత్రికుల సౌకర్యార్థం సత్రాలున్నవి. అవి దేవస్థానం మేనేజిమెంటు అధ్వర్యం క్రింద వున్నవి. ఆలయంయొక్క ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్

కార్యాలయం కొండక్రిందనే వున్నది. కోరిన యాత్రికులకు ఈ కార్యాలయంవారు తగు సౌకర్యాలు కల్పిస్తారు.

*శంఖారం* : అనకాపల్లి ట్రావెలర్స్ బంగళాకు ఈశాన్యంగా 1½ మైళ్ళ దూరంలో శంఖారం ఒక చిన్నగ్రామం. అనకాపల్లి ప్రసిద్ధ వ్యాపారకేంద్రం. ఇది విశాఖపట్నానికి 24 మైళ్ళ దూరంలోవుంది. శంఖారం గ్రామంలో తూర్పుకూ పడమరకూ వ్యాపించి రెండు చిన్నకొండ లున్నవి. దీనిని "బొజ్జన్నకొండ" అంటారు. ఇక్కడ బౌద్ధ అవశేషాలు వున్నవి. ఇచట అనేక పర్వత శిఖరాలున్నవి. వాటిని బౌద్ధ స్తూపాలుగా మలిచారు. ఈ శిఖరాలను కోటిలింగాలంటారు. ఈ కొండలను మూడుచోట్ల ఎంతో శ్రమపడి 3 పెద్ద స్తూపాలుగా తొలిచారు. వీనిలో పెద్దస్తూపం 30అడుగుల వ్యాసరేఖ గలది. కొండలకు తూర్పుదిశన రాతిని తొలిచి నిర్మించిన రెండంతస్తుల ఆలయం వుంది. దీనిలో అనేక బౌద్ధశిల్పాలు, నిలువెత్తు బుద్ధుని విగ్రహం వున్నవి.

విశాఖపట్నంనుంచి మద్రాసుకు పోయే ఆగ్నేయ రైల్వే ప్రధాన మార్గంపై అనకాపల్లి వున్నది.

*రామతీర్థం* ; విజయనగరానికి ఈశాన్యంగా 8 మైళ్ళ దూరంలో రామతీర్థం వున్నది. ఈ గ్రామ జనాభా ఒక వెయ్యి. గ్రామానికి ఉత్తరాన రెండు కొండలున్నవి. వీనిలో ఒకకొండను బోదికొండ అంటారు. దానిపై పడమటివైపున ఇటుకలతో కట్టబడి ఇప్పుడు శిథిలావస్థలోవున్న దేవాలయం ఒకటి కలదు. ఆ ఆలయంలో జైనతీర్థం కరుల రాతివిగ్రహాలు మూడువున్నవి ఇవి '½ అడుగులు మొదలు 3అడుగుల ఎత్తున చక్కగా చెక్కబడివున్నవి. ఈకొండకు ఇంకాపైన ఒకపెద్ద బండక్రింద ఒక జైన విగ్రహం వున్నది. ఈ విగ్రహం కొంత దెబ్బతిన్నది. ఈ కొండపైన, ఇంకా ఇతర కొండలపైన అనేక శిల్పాలున్నవి. ఒక శాసనంకూడా వున్నది. అది క్రీ. శ. 1011 నుంచి 1022 వరకు పరిపాలించినట్టి ఒకానొక తూర్పు చాళుక్య రాజుయొక్క చిహ్నమని భావింపబడు తున్నవి.

ఆర్ష శాస్త్రరీత్యా రామతీర్థానికి మంచి ప్రాముఖ్యత వున్నది. అంతేగాక పవిత్రమైన రామతీర్థం చుట్టూ ఇటీవలకాలంలో ఒక రామాలయం నిర్మింపబడింది. రామతీర్థాన్ని గూర్చి స్థానికంగా ఒక గాథ వ్యాప్తిలో వుంది. రావణుడు సీతాదేవిని అపహరించి తీసుకొనిపోతూవుండగా ఆమె తన కాలి అందెను ఇచటి కొండపై విసరివేసినదట. ఆ అందెను రాముడు లక్ష్మణుడు చూచి. అది తనదేనని గుర్తుపట్టి తన రక్షణకై వారిద్దరూ వస్తారని అనుకొని ఆమె అలా దానిని పడవేసిందట. విజయనగరంలోదిగి ఈ తీర్థమును చేరుకోవచ్చును. విజయనగరంలో యాత్రికుల కొరకు పి. డబ్ల్యు. డి. వారి ట్రావెలర్స్‌బంగళా ఒకటి మునిసిపాలిటీవారి ట్రావెలర్స్‌బంగళా ఒకటి వున్నవి. విజయనగరంలో మంచి హోటళ్ళు వున్నవి. మద్రాసు - కలకత్తా రైలుమార్గంపై వియజయనగరం ఒక జంక్షను.

*అరకులోయ* ; ఆంధ్రప్రదేశ్ మొత్తంలో నివాసస్థావరం కాగల కొండ ప్రదేశాలలో మిక్కిలి సుందరమైనది అరకులోయ అని చెప్పవచ్చు. ఇది విశాఖపట్నానికి 70 మైళ్ళ దూరంలో వుంది. ఇక్కడికి వెళ్ళడానికి ఒకటోరకమైన రోడ్డు వుంది. ఈ రోడ్డులో కొంత భాగానికి అనంతగిరి ఘాట్ రోడ్డు అనిపేరు. అనంతగిరి దాటిన తరువాత సుంకరమెట్టకి సమీపంలో యీ రోడ్డు యెత్తు సముద్రమట్టం నుంచి 3827 అడుగులు వుంటుంది. అనంతగిరిలోనూ, సుంకరమెట్టలోనూ కూడా ట్రావెలర్లబంగళా లున్నాయి. ఈ జిల్లాలోని కొండలలోకు మొత్తంలో మిక్కిలి యెత్తైన శిఖరం అనంతగిరి, సుంకరమెట్టలకి మధ్యవుంది. దీనికి గాలికొండ అని పేరు. ఇది సముద్రమట్టానికి 5300 అడుగుల యెత్తున వుంది. సుంకరమెట్ట రోడ్డుమీదుగా వెళితే దిగువన రమణీయమైన ప్రకృతి దృశ్యాలతోకూడిన అరకులోయ వస్తుంది. ఈ లోయ సముద్రమట్టానికి 3200 అడుగుల యెత్తున వుంది. అక్కడ కాలనైజేషన్ ప్రణాళిక ఒకటి అమలులోవుంది. బహుళార్థ ప్రయోజన కరమైన అభివృద్ధిప్రాజెక్టు ప్రారంభంతో అక్కడ అభివృద్ధి కార్యక్రమాలు యెక్కువగా జరుగుతున్నాయి. చక్కని ప్లాను ప్రకారం టౌనుషిప్పు నిర్మాణానికి యేర్పాట్లు చేయబడ్డాయి. త్వరలోనే అది యావత్తు ఆంధ్రప్రదేశ్‌కి వినోదకేంద్రం కాగలదు.

ఇక్కడ కొండజాతి ప్రజలు యెక్కువగా వుంటారు. వారివల్ల యీ లోయ ప్రకృతిసౌందర్యం యినుమడిస్తుంది. చాలా గ్రామాలలో కన్యలు నాట్యబృందాలుగా యేర్పడి స్వజాతీయులకి వినోదం చేకూరుస్తారు. వారు సామాన్యంగా శుభ్రమైన తెల్లబట్టలనుకాని లేక యెర్రటి యెరుపు బట్టలను కాని ధరిస్తారు. మోచేతివరకూ మంచిమంచి రంగులవి పెద్దపెద్ద గాజులు వేసుకుంటారు. కాళ్ళకి యిత్తడి పట్టీలు పెట్టుకుంటారు. వారికి పువ్వులంటే ప్రీతి. వారు తమ నల్లని కురులను పువ్వులతో అలంకరించుకుంటారు మద్దెలధ్వని ఒకరకం శ్రుతిలో పడినప్పుడు నాట్యం అరంభమవుతుంది. ప్రతి బృందము పొడుగ్గా బారుతీరి నిలుచుంటుంది. బారుకి

మొట్టమొదట తురాయిధరించిన నాయకురాలు వుంటుంది. ప్రతి కన్య తన కుడిచేతిని పక్కకన్య నడుముకిచుట్టి ఆ తరువాతికన్య యెడమ మోచేతిని పట్టుకుంటుంది. ఆ విధంగా ఒకరి చేతు లొకరు పట్టుకొని వరుసతీరిన బాలికలు లయ తప్పకుండా అడుగులు వేస్తారు. ఈ అడుగును "ప్రమెరీడాన్సెసీ" చేతిలోని వేత్రం కదలికకి అనుగుణంగా వేస్తారు. అలా అడుగువేస్తూనే వొంపుతిరిగి, వంకీలుగా, వలయాలుగా, యెనిమిదంకెగా యేర్పడి మళ్ళీ తిరిగి ఒకరి పక్క ఒకరు వరుసగా నిలుచుంటారు. ఏదో మంచిరంగైన సర్పంలా ముందువెనుకలకి కదుల్తూ ఒక్కక్షణమైనా ఆగకుండా అడుగులు వేస్తారు. మొదట నెమ్మదిగా, విన్యాసంగా వేస్తారు. మద్దెలధ్వని వేగం హెచ్చినకొద్దీ అడుగులుకూడా త్వరత్వరగా దూరదూరంగా పడతాయి. తుదకి యెవరో ఒకరు అడుగు తప్పినప్పుడు నవ్వులమధ్య వరుస చెదిరిపోతుంది. ప్రసిద్ధమైన ధింసా నృత్యమంచే యిదే. అరకు లోయలోని కొండజాతి ప్రజల జీవిత విధానంలో యిది అద్వితీయమైంది.

*ఏజన్సీ* : (అరకులోయ దీనిలో ఒకభాగం -) లో చైత్ర మాసం (మార్చి - ఏప్రిల్)లో జరిగే విందు మిక్కిలి వేడుకైనది. ఆనెలలో ప్రతిదీ వినోదకరంగానే వుంటుంది. పొలాల్లో పనియేమీ వుండదు. అడవులు తగుల బెట్టబడి, షికారీకి అనువుగా వుంటాయి. సాగో చెట్లనుంచి కల్లు లభిస్తుంది. పానీయం తయారీకి పనికివచ్చే మోహ్వాపువ్వులు రాలుతూ వుంటాయి. ఈనెల అంతాకూడా విందులు జరుపుకోడంతోనూ, బాగాత్రాగి రాత్రి తెల్లవార్లూ నృత్యగీతాలతో కాలక్షేపం చేయడంతోనూ గడుస్తుంది. మోహ్వా పువ్వుల్ని యేరడంకోసం అడవులలోనికి వెడతారు. ఈ సమయంలో అవివాహితులమధ్య స్వేచ్ఛాప్రేమ అమలులో వుంటుందిట. ఈనెలలో అత్యంత ప్రధానమైన విషయం వేట. ఇందులో దృఢకాయులైన పురుషులంతా పాల్గొంటారు. తరుచు వారు యేదోఒక మృగజంతువును వేటాడేవరకూ రోజులకొద్దీ అడవులలో వుంటారు. ఒకవేళ వారు వట్టిచేతులతో తిరిగి రావడానికి సాహసించి నట్లయితే స్త్రీలు వారిపై వడిసెలతో రాళ్లు మున్నగువాటిని రువ్వికొడతారు.

అరకు లోయలో పబ్లిక్ వర్క్సుశాఖ ఆధ్వర్యంలో చక్కని ఇనస్పెక్షన్ బంగళావుంది. దక్షిణాది వదార్థాలను సమకూర్చే ఫలహారశాలలు కూడా వున్నాయి.

*బొర్రాగుహలు* : అరకులోయ మార్గంలో విశాఖపట్నానికి యించుమించు 55 మైళ్ల దూరంలో అనంతగిరి వున్నదని యిదివరకే చెప్పబడింది. అనంతగిరి యింకా మూడు మైళ్లు వుందనగానే అదే రోడ్డుమీదవున్న ఒకబోర్డు బొర్రా గుహలకి వెళ్లే సన్ననిత్రోవ నొకదానిని సూచిస్తుంది. అనంతగిరి ట్రావెలర్ల బంగాళాలోఆగి బొర్రాగుహలను దర్శించవచ్చును. ఇక్కడికి వెళ్ళడానికి మొత్తం 9 మైళ్ల దూరం నడవాలి. బొర్రాగ్రామానికి సమీపంలో ఒకప్రవాహం హఠాత్తుగా ఒకచిన్న సున్నపురాతి కొండలో అదృశ్యమై, ఆ కొండగుండా, వరుసగావున్న కొన్ని సున్నపురాతి గుహల పొడుగునా ప్రవహించి. మళ్ళీ 300 అడుగుల దిగువన కొండల మధ్యనున్న లోతైన ప్రదేశంలో బయలు పడుతుంది. పైగుహలు చిత్ర విచిత్రమైన ఆకారంగల శిలాజిత్తు మున్నగు రాళ్ళతో చూడముచ్చటగా వుంటాయి. ఈ ప్రదేశం పవిత్రమైనదిగా పరిగణింప బడుతుంది. ప్రతి శివరాత్రికి యిక్కడ వుత్సవం జరుగుతుంది. ఈ వుత్సవానికి అన్ని గ్రామాలనుండి వందలాది ప్రజలు వస్తారు.

బొర్రాగుహలకి వెళ్ళే త్రోవలో అభ్రకం గనులు చాలా వున్నాయి. కెంపులవంటి జాతిరాళ్ళ గనులను కనుగొనే అవకాశాలు యిక్కడ చాలా వున్నాయని విశ్వసించ బడుతున్నది.

*మచ్ఖండ్* : విశాఖపట్నం - అరకులోయ రోడ్డు మీదుగా పైకివెడితే మచ్ఖండ్ జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు వస్తుంది. ఇది అరకులోయకి యించుమించు 58 మైళ్ళ దూరంలో వుంది. (విశాఖపట్నానికి 125 మై. దూరం) అరకునుంచి కొంచెం దూరంలో, మచ్ఖండ్వద్ద నది కుడి గట్టువరకూ ఆరోడ్డు ఒరిస్సా ప్రాంతంగుండా పోతుంది. మార్గమధ్యంలో పాడ్వాలోని చిన్నకొండపై చక్కని ట్రావెలర్ల బంగళావుంది. ఈ ప్రదేశం వినోద కాలక్షేపానికి ఆదర్శప్రాయంగా వుంటుంది. పాడ్వా చుట్టూవున్న కొండలను, లోయలను యిక్కడినుంచి దిఙ్మాత్రంగా చూడవచ్చును. ఇంకా పైకివెళ్ళిన తరువాత జైపూరుకివెళ్ళే రోడ్డుకి మళ్ళాలి. ఇది మచ్ఖండ్ జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టుకి నిర్మించిన క్రొత్త రోడ్డుపై వుంది. డుడుమావద్ద 550 అడుగుల యెత్తునుంచి పడే జలపాతం నుంచి 110 కి. వా. విద్యుచ్ఛక్తిని వుత్పత్తి చేయడానికి యిక్కడ యేర్పాటు చేయబడింది. ఈ విద్యుచ్ఛక్తిని ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా ప్రభుత్వాలు రెండూ పంచుకుంటాయి. ఒక డైవర్షన్ వైయిర్, మానవనిర్మితమైన కాలువా యీ రెండూ ఈ ప్రాజెక్టులోని ప్రధానాంగాలు. ఈ కాలువ కొంతదూరం రాతిలో దొలిచిన టన్నెలుల ద్వారా ప్రవహిస్తుంది. ఆ తరు

వాత పెద్దపెద్ద పైపులైన్ల గుండా ప్రవహిస్తుంది. ఈ పైపు లైన్లు నీటిని విద్యుదుత్పత్తి కేంద్రానికి తీసుకుని వెడతాయి. విద్యుదుత్పత్తి కేంద్రం జలపాతాల అడుగుమట్టంతో సమానమైన మట్టంలో నిర్మించబడింది. పైపులైన్ మార్గంలో సరైన స్థలంనుంచి చూస్తే జలపాతాలు కనిపిస్తాయి. వర్షా కాలంలో యీ జలపాతాలు రమణీయంగా వుంటాయి. పైపు లైన్లలోనికి కొంతనీరు మళ్ళించ బడినప్పటికీ అవి బాగానే వుంటాయి. చివరిభాగంవద్ద అదిరిపెట్టబడిన నీరు జలపాతానికి దిగువ సహజమైన ప్రవాహంగా రూపొందే మచ్ ఖండ్ నదిలో కలిసే ప్రదేశాన్ని చూస్తే తీవ్రత తగ్గిన గ్రాండ్ గనియన్ జ్ఞాపకం వస్తుంది.

మచ్ ఖండ్ జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టువద్ద ఒక ఇనస్పెక్షన్ బంగాళావుంది. ఇది సూపరింటెండింగు ఇంజనీరు అధ్వర్యంలోవుంది. ఇది ఒక చిన్న కొండగుట్టపై వుంది. ఇక్కడినుంచి దిగువనగల సుందరమైన నదీ, కొంచెం దూరానకల ప్రాజెక్టూ, చుట్టూరావున్న లోయలు కనబడతాయి. ఇదికాక యింకా కొన్ని విశ్రాంతి మందిరాలు, ఫలహారశాలలు కూడా వున్నాయి. ఇక్కడ మంచివసతి, దక్షిణాది ఆహారపదార్థాలు లభిస్తాయి.

ఇంజనీరింగు ప్రాజెక్టులలో ఆసక్తికలవారు మచ్ ఖండ్ నుంచి జాలాపుట్ వెళ్ళవచ్చును. అక్కడ చాలా పెద్ద ఆనకట్ట ఒకటి పూర్తి కావస్తున్నది. ఇది మచ్ ఖండ్ జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టులో ఒక భాగం. ఇది మచ్ ఖండ్ నుంచి యించుమించు 30 మైళ్ళ దూరంలోవుంది. జాలాపుట్ లో కూడా ఒక ఇనస్పెక్షన్ బంగాళావుంది. ఇది మచ్ ఖండ్ సూపరింటెండింగు ఇంజనీరు అధ్వర్యంలో వుంది.

*గూడెం యేజన్సీ* : విశాఖపట్నం జిల్లాలో మిక్కిలి ఆటవికమైన ప్రదేశం గూడెం యేజన్సీ. దీనిలో ఆటవికమైన ప్రదేశం 1869 చ. మైళ్ళు వుంది. ఇక్కడి ప్రజలు యింకా వెనుకబడి వున్నారు. ప్రదేశమంతా అడవుల మయమై వుంది. ఎలుగుబంట్లు, చిరుతపులుల వంటి అడవిమృగాలు చాలా యెక్కువగా వుంటాయి. ఈప్రదేశం మధ్యభాగంలో పెద్దపులులు కూడా యెక్కువేనని చెప్పవచ్చు. గూడెం (చింతపల్లి) తాలూకా ముఖ్యపట్టణం చింతపల్లి. ఇది విశాఖపట్నానికి యించుమించు 96 మై. దూరంలో వుంది. చింతపల్లిలో ట్రావెలర్ల బంగాళా వుందికాని భోజనానికి సక్రమమైన యేర్పాట్లు లేవు. షికారుపట్ల రమణీయమైన ప్రకృతిదృశ్యాలపట్ల ఆసక్తి గలవారికి చింతపల్లిలోను, దాని చుట్టుపట్ల చూడవలసిన దెంతయినా వుంది. చింతపల్లికి యించుమించు 50 మైళ్ళ దూరంలో సీలేరు ప్రాజెక్టు వుంది. మచ్ ఖండ్‌వద్ద ప్రాజెక్టుద్వారా దిగువకువచ్చే మచ్ ఖండ్ నదీజలాలను వుపయోగించి ద్వితీయ పంచవర్ష ప్రణాళికక్రింద 110 వేల కి. వా. విద్యుచ్ఛక్తిని వుత్పత్తి చేయడానికి సీలేరు ప్రాజెక్టు వుద్దేశించబడింది. సీలేరులో ట్రావెలర్ల బంగాళాలేదు. గూడెం యేజన్సీ ఆటవిక ప్రదేశమై వుండడం వల్లనూ, అక్కడ జనసంఖ్య చాలా పలుచగా వుండడం వల్లనూ అక్కడికి వెళ్ళేవారు భోజనానికి స్వంతయేర్పాట్లు చేసుకొని వెళ్ళడం మంచిది.

*కొండకర్ల ఆవ* ; విశాఖపట్నానికి యించుమించు 30 మైళ్ల దూరంలోనున్న కొండకర్లలో పెద్దసరస్సు ఒకటి వుంది. ఇక్కడ కొంచెంసేపు వినోద కాలక్షేపం చేస్తే చేయవచ్చు. కాని అంతకుమించిన ప్రాముఖ్యమేదీ దీనికి లేదు. ఇక్కడ క్యాంపు చేయడానికి అక్టోబరు, నవంబరు నెలలు తగినవి. ఆ సమయంలో యీ సరస్సులో పెద్ద యెత్తున బాతులను వేటాడ్డానికి అవకాశం వుంటుంది. ఈ సరస్సుకి 2, 3 ఫర్లాంగులదూరంలో ఒకట్రావెలర్ల బంగాళా వుంది. దీనికి యించుమించు అరమైలు దూరంలో ఒక చిన్నగ్రామం వుంది. ఇక్కడికి వచ్చేవారు స్వంతంగా భోజనానికి యేర్పాటు చేసుకుని రావటంమంచిది.



# ద్వితీయ ప్రణాళికలో ఇతోధికంగా వైద్యసదుపాయాలు



ప్రజారోగ్యాన్ని పరిపోషించడానికి తప్పనిసరిగా కావలసిన పరిస్థితులు కొన్ని వున్నాయి. అవి : పరిసరాలు ఆరోగ్యకరమైన జీవితానికి అనువైనవిగా వుండాలి. తగినంత పుష్టికరమైన ఆహారం వుండాలి. సమాజంలో అందరికీ, వారికి డబ్బు యిచ్చే సామర్థ్యం వున్నా లేకపోయినా కూడా, ఆరోగ్యరక్షణకు, వ్యాధి నిరోధానికి, చికిత్సకీ తగిన సదుపాయాలు వుండాలి. ప్రజలు తమ ఆరోగ్య రక్షణ విషయంలో ఆసక్తితో సహకరించాలి.



*రెడ్‌క్రాస్ సొసైటీ, సెంట్ జాన్ అంబ్యులెన్స్, గిల్డ్ ఆఫ్ సర్వీసుల వార్షిక సర్వసభ్య సమావేశం హైదరాబాదులోని రాజ్ భవన్‌లో 1957 ఏప్రిల్ 6 వ తేదీన జరిగింది. ఆ సందర్భంలో ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ ఆంధ్రరాష్ట్రశాఖ కార్యదర్శి నివేదిక చదువుతున్నారు.*



*1957 ఏప్రిల్ 7 వ తేదీన ప్రపంచ ఆరోగ్య దినోత్సవం సందర్భంలో హైద్రాబాదులో ఏర్పాటు చేయబడిన బహిరంగసభకు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు అధ్యక్షత వహించారు. సభలో వారు ప్రసంగిస్తున్న దృశ్యం.*

ప్రస్తుతపు ఆరోగ్య సేవాకార్యక్రమాల్ని విస్తృత పరచి, ఆవిధంగా వాటిని మరింత యెక్కువగా ప్రజల అందుబాటులోనికి తేవడం, జాతీయ ఆరోగ్యం స్థాయిని క్రమేణా అభివృద్ధి పరచడం యివి ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింది ఆరోగ్య కార్యక్రమాల సాధారణ ఆశయాలు. నిర్దిష్టమైన ఆశయాలు యివి :

1, ఆరోగ్య సేవాకార్యక్రమాలకి మూల స్థావరాలు కాగల సంస్థలను నెలకొల్పి, తద్వారా స్థానిక ప్రజలకి, చుట్టుపట్ల ప్రదేశాలలోని ప్రజలకి సౌకర్యం కలిగించడం ;

2. సాంకేతిక శిక్షణకి తగిన సౌకర్యాలను కల్పించి సాంకేతిక విషయజ్ఞులయిన సిబ్బందిని అభివృద్ధి పరచడం, సుశిక్షితులయిన వ్యక్తులను నియమించడం ;

3. ప్రజారోగ్యాభివృద్ధికి తొలిచర్యగా, సమాజంలో ఒకచోట విస్తారంగా వ్యాప్తిలో వుండగల అంటువ్యాధుల నిరోధానికి చర్య తీసుకొనడం ;

4. పరిసరాల పారిశుద్ధ్య వుద్యమాన్ని చురుకుగా కొనసాగించడం.

5. ప్రజల ఆరోగ్య ప్రమాణాన్ని అభివృద్ధి పరచడానికై కుటుంబ నియంత్రణం మున్నగు కార్యక్రమాల అమలు.

ఆస్పత్రులలో వైద్యసౌకర్యాలను హెచ్చించడానికీ, అభివృద్ధి చేయడానికీ ద్వితీయప్రణాళిక కాలంలో భారత దేశంలో మొత్తం రూ. 43 కోట్లు ఖర్చు పెట్టబడతాయి. గ్రామసీమలలో వ్యాధినిరోధం, చికిత్స విషయంలో యేకీకృత వైద్య సేవాసౌకర్యాలకై జాతీయప్రణాళికలో రూ. 23 కోట్లు కేటాయించ

బడ్డాయి. దీనిక్రింద అభివృద్ధి బ్లాకులలో 3,000 ఆరోగ్యయూనిట్లు ప్రారంభింపబడతాయి.

1951-52 లో వున్న వైద్యకళాశాలల సంఖ్య 30; 1955-56 లో అది 42 కి పెరిగింది. ఈ సంఖ్య కూడా ద్వితీయ ప్రణాళిక కాలంలో అవసరమైన హెచ్చుమంది డాక్టర్లను తయారు చేయడానికిచాలదు. అందుచేత మరికొన్ని వైద్యకళాశాలలను నెలకొల్పాలనీ, వున్నవాటిని విస్తృత పరచాలనీ సంకల్పించబడింది. ఇందు నిమిత్తం రూ. 26.5 కోట్లు కేటాయించబడినవి. పురుష డాక్టర్ల శిక్షణకే కాక హెచ్చుమంది నర్సులు, మంత్రసానులు, ఫార్మసిస్టులు, శానిటరీ యినస్పెక్టర్లు మున్నగు సాంకేతిక సిబ్బంది శిక్షణకి కూడా యీ ప్రణాళికలో వీలు కల్పించబడింది.

మలేరియా నివారణ కార్యక్రమం క్రింద 200 కంట్రోలు యూనిట్లను నెలకొల్పాలని సంకల్పం. ప్రతియూనిట్టు పదిలక్షలమంది ప్రజలకి రక్షణ కల్పిస్తుంది. బి. సి. జి. టీకాల కార్యక్రమం ప్రకారం 1960-61 నాటికి వ్యాధికి గురికాగల అవకాశం గల వయస్సులో వున్న వారందరికీ అనగా 25 సంవత్సరాలలోపు వయస్సు గల వారందరికీ టీకాలు వేయబడాలి. క్షయవ్యాధి నిరోధానికీ, నివారణకీ యించుమించు 200 క్షయవ్యాధి క్లినిక్కులు నేలకొల్పబడతాయి. ఈ క్లినిక్కులు గృహచికిత్సకికూడా శక్తివంతంగా తోడ్పడతాయి. కుటుంబ నియంత్రణంకోసం రూ. 5 కోట్లు కేటాయించబడినవి. ప్రణాళిక కాలంలో పట్టణాలలో యించుమించు 300, పల్లె ప్రాంతాలలో 2,000 క్లినిక్కులు యేర్పాటు చేయబడతాయి.

## రాష్ట్ర ప్రణాళిక

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రప్రణాళికలో, ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో వైద్య సౌకర్యాల అభివృద్ధికై వరుసగా రూ. 360.84 లక్షలు, రూ. 276.3 లక్షలు



*1957 ఏప్రిల్ 7 వ తేదీన ప్రపంచ ఆరోగ్య దినోత్సవం సందర్భంలో ఏర్పాటుచేయబడిన "ఆహారవీథిని" ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి పరిశీలిస్తున్నారు.*

కేటాయించబడినవి. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల స్థాపనకై ఒకకోటి రూపాయలు కేటాయించబడినవి. ప్రతియూనిట్టు 66,000 మందికి వుపయోగ పడుతుంది. తొలిప్రణాళిక కాలంలో యీ ప్రాథమిక ఆరోగ్య యూనిట్లు ఆంధ్రలో 36, తెలంగాణాలో 25 ప్రారంభింపబడ్డాయి. ద్వితీయ ప్రణాళిక కాలంలో 175 యూనిట్లను ప్రారంభించాలని సంకల్పం.

ప్రణాళిక కాలంలో విశాఖపట్నం, గుంటూరు వైద్య కళాశాలలలోని స్థానాల సంఖ్య హెచ్చించ బడగలదు. గుంటూరు, కర్నూలులలోని జనరల్ ఆస్పత్రుల విస్తృతీకరణకు, కర్నూలులో వైద్యకళాశాల ప్రారంభానికి ఒక కోటి రూపాయలు కేటాయించబడినవి.

క్షయ మున్నగు అంటువ్యాధుల చికిత్సకు ఆంధ్ర ప్రదేశ్‌కి 5,000 మంచాలు అవసరం. కాని ధనాభావం వల్ల తొందరగా యీ లక్ష్యాన్ని చేరడానికి వీలులేక పోతున్నది. అయితే క్షయ ముదరకుండానే వ్యాధి నిరూపణ చేయడానికీ, వ్యాధిని నిరోధించే శక్తిని పెంపొందించడానికి బి. సి. జి. టీకాలను వేయడానికీ వీలు కల్పించ బడుతుంది. తాలూకా, జిల్లా ముఖ్య పట్టణాలలో క్షయచికిత్సా క్లినిక్కులను నెలకొల్పాలనీ నెల్లూరు, హైదరాబాదు, వికారాబాదులలోని క్లినిక్కులను విస్తృత పరచాలనీకూడా సంకల్పించబడింది.

విక్టోరియా ఆస్పత్రిని ప్రత్యేకించి ప్రసూతి ఆస్పత్రిగానూ, నిలోఫర్ ఆస్పత్రిని పిల్లల చికిత్సాకేంద్రంగానూ మార్చేవిషయం ఆలోచనలో వుంది. ఉస్మానియా వైద్య కళాశాలకి క్రొత్త భవనాలను నిర్మించడానికీ, వుస్మానియా ఆస్పత్రిలోని వైద్య సౌకర్యాలను విస్తృత పరచడానికీకూడా నిర్ణయం జరిగింది. రాష్ట్రంలోని జిల్లా, తాలూకా ఆస్పత్రుల అభివృద్ధికి చర్య తీసుకొనబడుతుంది. ప్రస్తుతం ఔషధ శాలలు లేని గ్రామాలు, రెవిన్యూ ఫిర్కాలలో చిన్నచిన్న ఔషధ శాలలు ప్రారంభింపబడతాయి.

ఆంధ్రప్రదేశ్ మొత్తంలో పుట్టకురుపు నివారణ చేసే ఆస్పత్రి ఒకేఒకటి వుంది. ద్వితీయ ప్రణాళిక కాలంలో దాని అభివృద్ధికి రూ. 8 లక్షలు కేటాయించబడినవి. ప్రస్తుతం ఆఆస్పత్రిలో 44 మంచాలున్నాయి. ప్రణాళిక కాలం సమాప్తినాటికి యీ సంఖ్య 200 కు హెచ్చించబడుతుంది. గాంధీ వైద్యకళాశాల, కింగ్ యెడ్వర్డు మెమోరియల్ ఆస్పత్రుల విస్తరణకై రూ. 50 లక్షలు కేటాయించ బడ్డాయి. హైదరాబాదులోని కేంద్రపరిశోధక లేబొరేటరీ అభివృద్ధికై రూ. 20 లక్షలు కేటాయించబడినవి.

## ఆరోగ్య విద్యాబోధ

వైద్య, ప్రజారోగ్య సౌకర్యాల ఆశయం పూర్తిగా ఫలించాలంటే, ప్రజలు తమతమ వైఖరిని, అలవాట్లను మార్చుకొని ఆ సౌకర్యాలను పూర్తిగా వినియోగించుకోవాలి. ఇందుకోసం ఆరోగ్య విద్యాబోధనకై ప్రత్యేకంగా కృషిచేయవలసి వుంది. ప్రజలు తమ జీవన పరిస్థితులను స్వయంగా అభివృద్ధి పరుచుకుని, ఆరోగ్యాభివృద్ధిపట్ల తమకువ్యక్తిగతంగానూ, సమిష్టిగానూ గల బాధ్యతలను గుర్తెరిగేటట్టు చేయడంతో యిది ప్రారంభ మవుతుంది. ప్రజల మంచిచెడ్డలు, అవసరాలు, ఆశయాల దృష్ట్యానే దీనికి అంకురార్పణ జరుగుతుంది. వారి సద్భావాన్ని చూరగొని, స్థానికంగా జరిగే పథకనిర్మాణం, దాని అమలువిషయంలో వారి సహాయ సహకారాలను పొందడమే దీని ప్రధానాశయం. అయితే యిందుకు నిపుణుల సహాయం కూడా అవసరమే వున్నది. కేంద్ర, రాష్ట్ర ఆరోగ్య శాఖలలో నెలకొల్పబడుతున్న ఆరోగ్య విద్యా సౌకర్యాలు యీ విషయంలో ఆవసరమైన కృషికి తోడ్పడగలవు.



# ఆంధ్రప్రదేశ్‌లో సహకారోద్యమ ప్రగతి

శ్రీ డి. సంజీవయ్య
రాష్ట్ర సహకార శాఖామంత్రి.

"సహకారోద్యమం ప్రధానంగా ప్రజా ఉద్యమం. స్వయకృషి పరస్పర సహకారం—ఇవి ఈ ఉద్యమానికి ప్రాతిపదికలు." అంటూ రాష్ట్ర సహకారశాఖామంత్రి శ్రీ డి. సంజీవయ్య 28-3-1957 తేదీన ఆలిండియా రేడియో హైదరాబాదు నిలయం నుంచి ప్రసంగించిన సందర్భంలో ఉద్ఘాటించారు. భారతదేశంవంటి ప్రజాస్వామ్యదేశంలో, వ్యవసాయ ప్రధానమైన దేశంలో ప్రణాళికాబద్ధమైన ఆర్థికవ్యవస్థ రూపొందాలంటే సహకారోద్యమానికి హెచ్చు ప్రాముఖ్యం వుంటుందని ఆయన నొక్కిచెప్పారు.

ఆంధ్రప్రదేశ్‌లో సహకారోద్యమ ప్రగతిని సమీక్షిస్తూ ఈ రాష్ట్రంలో సహకారోద్యమానికి ఒక చరిత్ర వుందనీ, ఇది వ్యవసాయ ప్రధానమైన రాష్ట్రం కావడంచేత ఈ ఉద్యమం దినదిన ప్రవర్థమానమవుతూ వచ్చిందనీ మంత్రి అన్నారు.

ఆంధ్ర ప్రాంతంలో అన్ని విధములయిన సహకార సంస్థల మొత్తం సంఖ్య 11 వేలు. ఈ 11 వేల సంస్థలు 14 లక్షల 22 వేల సభ్యత్వం, రూ. 35 కోట్ల పెట్టుబడి మూలధనం కలిగి వున్నవి.

తెలంగాణాలో మొత్తం 7,982 సహకారసంఘా లున్నవి. వాటి సభ్యత్వం 8,28,000; వాటా మూలధనం రూ. 11.78,00,000 లు.

శ్రీ సంజీవయ్య తమ ప్రసంగంలో ఇంకా ఇలా అన్నారు:

"మన ప్రథమ పంచవర్ష ప్రణాళిక సహకారోద్యమ ప్రాముఖ్యతను గుర్తించింది ఈ ఉద్యమాన్ని దృఢమైన పునాదులపై నిర్మించి, దీనిని ఇంకా విస్తృతం చేయడానికై తలపెట్టబడింది. అయితే ఇందుకొరకై నిర్దిష్టమైన పథకాలేవీ అప్పుడు ఆ ప్రణాళికలో చేర్చటానికి వలనుపడలేదు. రాష్ట్రంలో సహకారోద్యమ అభివృద్ధికై అమలుపరచ వలసిన పథకాలలో వ్యవసాయ పరపతి చాలా ముఖ్యమైనది. ఈనాడు ఆంధ్ర ప్రాంతంలో 6680 వ్యవసాయ పరపతి సంఘాలు వున్నవి. వీటి సభ్యత్వం 6 లక్షల 49 వేలు. ఈ సంఘాలు నూరింట 66 వంతుల గ్రామాలకు, నూటికి 19 వంతుల జనాభాకు వర్తిస్తూ వ్యవసాయదారులకు పరపతి సౌకర్యాలను కలుగజేస్తున్నవి. ప్రథమ ప్రణాళిక ముగిసేనాటికి ఈ సంఘాలు ప్రతిఏటా ఇచ్చే అప్పు మొత్తాలు 3 కోట్ల రూపాయలనుంచి క్రమేణా 6 కోట్ల రూ ల వరకు పెరిగినవి. తెలంగాణా ప్రాంతంలో 1955-56 సంవత్సరంలో 3017 వ్యవసాయ పరపతి సంఘాలు పనిచేస్తూ వున్నవి. వాటి సభ్యత్వం 99, 298; పెట్టుబడి ధనం 106 లక్షల 86 వేల రూపాయలు. అఖిలభారత గ్రామీణ పరపతి విచారణ సంఘంవారి సిఫారసుల ననుసరించి తెలంగాణా ప్రాంతంలో రెండవ పంచవర్ష ప్రణాళిక కాలములో 190 పెద్ద రకపు సహకార పరపతిసంఘాలను నెలకొల్పవలెనని లక్ష్యమేర్పరచబడింది. ఇందుకుగాను మొదటిదఫాగా 23 సంఘాలు నెలకొల్పబడినవి.

## వ్యవసాయ పరపతి

గ్రామీణ పరపతి విషయమై ఇండియా రిజర్వు బ్యాంకువారు దేశవ్యాప్తంగా పరిశీలన జరిపి గ్రామీణ

పరపతి వ్యవస్థలోవున్న కొన్ని లోపాలను చూపెట్ట డమేగాక, ఈ వ్యవస్థ రైతులకు ఇతోధికంగా ప్రయోజనకారి కావడానికై కొన్ని ముఖ్యమైన సిఫారసులను కూడా చేశారు. ప్రస్తుతమున్న సహకార సంస్థలు నూటికి మూడువంతుల చొప్పున మాత్రమే వ్యవసాయదారుల పరపతి అవసరాలను తీర్చగలుగుతున్నవనీ, ప్రభుత్వం తక్కావీల రూపంలో చేసే సహాయం మరొక మూడువంతు లుంటుందని, ఇక పోతే మిగిలిన అవసరాలన్నీ ప్రయివేటు వడ్డీ వ్యాపారస్థులవల్లనే తీరుతున్నవనీ ఆ పరిశీలనవల్ల తేలింది. దీని అర్థమేమిటంటే 50 ఏండ్లపాటు కృషి చేసిన తరువాతకూడా సహకారోద్యమంవల్ల పెద్ద ప్రయోజనమేమీ కలుగలేదన్నమాట. అందువల్ల విశాలమైన, ఏక ఖండాలుగావున్న ప్రాంతాలలో సంఘాల సభ్యత్వాన్ని హెచ్చించడం ద్వారా, ప్రభుత్వ భాగస్వామ్యంతో సంస్థల పెట్టుబడి ధనాన్ని ఎక్కువ చేయడంద్వారా పరిమితమైన బాధ్యతతో వ్యాపారాన్ని పెంపొందించడం ద్వారా ప్రాథమిక పరపతి వ్యవస్థను పునర్నిర్మించవలెనని రిజర్వుబ్యాంకు పరిశీలనా సంఘంవారు సూచనలు చేశారు. సహకార సంస్థలను నిర్వహించేవారికి వేతనాలివ్వవలెననీ, పరపతికీ మార్కెటింగుకూ అనుసంధానం కలిగించవలెనని కూడా ఆ సంఘంవారు సూచించారు. 1955 లో కొత్తఢిల్లీలో జరిగిన వివిధ రాష్ట్రాల సహకారశాఖా మంత్రుల సమావేశంలో ఆసూచనలు ఆమోదింపబడ్డవి.

ఆంధ్రప్రాంతంలో గ్రామీణ పరపతి వ్యవస్థను పునర్నిర్మించడానికై ప్రయోగాత్మకంగా 'గ్రామ బ్యాంకులు' స్థాపించబడినవి. ఈ బ్యాంకులు వ్యవసాయోత్పత్తులను, నగలను ఇతరవస్తువులను హామీగా పెట్టుకొని వ్యవసాయదారులకు అప్పులిస్తూ వుంటాయి. సహకారశాఖా మంత్రుల సమావేశంలో గైకొనబడిన నిర్ణయాలను దృష్టిలోపెట్టుకొని అప్పటి ఆంధ్రప్రభుత్వం విశాఖపట్నం, పశ్చిమ గోదావరి, కర్నూలు జిల్లాలలోని కొన్ని తాలూకాలలో గ్రామీణ పరపతి విషయంలో ఒక పథకాన్ని మంజూరుచేసింది. ఈ పథకంక్రింద 88 పెద్దరకపు సంఘాలు నెలకొల్పబడ్డవి. గ్రామ బ్యాంకులు పెద్దరకపు సంఘాలు-ఈ రెండింటివల్ల రాష్ట్రమంతటా పరపతివ్యవస్థ శాఖోపశాఖలుగా విస్తరించి వ్యవసాయదారులు తాము మిగుల్చుకొన్న డబ్బును డిపాజిటు చేసుకోవడానికి, లేదా అక్కరపడినప్పుడు కొద్ది వడ్డీపై అప్పులు పొందగలగడానికీ తగు అవకాశాలు లభించగలవు.

## మార్కెటింగ్ సంఘాలు

ఆర్థికంగా రైతు బాగుపడాలంటే ఆతడు పండించిన పంటకు తగు ధర లభించాలి. అందుచేత ఈ విషయంలో రైతుకూ, వ్యాపారస్తునికీ మధ్య దళారులను తొలగించి వ్యవసాయోత్పత్తులకు సమంజసమైన ధరలు లభింపజేయడానికై ఆంధ్ర ప్రాంతంలోని మండీ కేంద్రాలన్నింటిలో ప్రస్తుతం 126 ప్రాథమిక మార్కెటింగు సహకార సంస్థలు పని చేస్తున్నవి. ఈ సంస్థలు రైతులకు ప్రతియేటా ఒక కోటి రూ. ల వరకు అప్పులు ఇవ్వడమే గాకుండా రసాయనిక ఎరువులు, వ్యవసాయ పనిముట్లు మొదలైనవికూడా సరఫరా చేస్తున్నవి. తెలంగాణా ప్రాంతంలో ఇటువంటి మార్కెటింగు సహకార సంస్థలులేవు. ఈ ప్రాంతంలో వున్నట్టి తాలూకా వ్యవసాయ సహకార సంఘాలు సరిగా పనిచేయడం లేదు. అందుచేత ముఖ్యమైన మండీ కేంద్రాలన్నింటిలో రెండవ ప్రణాళికకాలంలో 50 మార్కెటింగు సహకార సంస్థలను ఏర్పాటుచేయడానికి తలపెట్టబడింది. వ్యవసాయోత్పత్తులను నిలువ చేయడానికి రెండవ ప్రణాళికక్రింద ఆంధ్ర ప్రాంతంలో 208 గిడ్డంగుల నిర్మాణానికి 1 కోటి 15 లక్షల రూ. లు, తెలంగాణా ప్రాంతంలో 65 గిడ్డంగుల నిర్మాణానికి 24 లక్షల 50 వేల రూపాయలు వ్యయపరచవలెనని తలపెట్టబడింది. ఈ ఏర్పాటువల్ల వ్యవసాయోత్పత్తులను నిలువచేసుకొనడానికి, ఉత్పత్తిదారులు తమ పంటలకు మంచి ధరలను పొందడానికి వీలు కలుగుతుంది.

తెలంగాణా ప్రాంతంలో భూమి తనఖాబ్యాంకుల పరిస్థితి చెప్పుకోదగినంతగా లేదు. హైద్రాబాదు కేంద్ర సహకార భూమి తనఖాబ్యాంకు సమాఖ్యగా కేవలం 12 ప్రాథమిక బ్యాంకులు మాత్రమే పని చేస్తూ వున్నవి. అందుచేత ఆంధ్ర హైదరాబాదు భూమి తనఖాబ్యాంకులను ఏకీకరించవలెనని సంక

ల్పించబడింది. ఇది జరిగినప్పుడు తెలంగాణాలో భూమి తనఖా బ్యాంకులు విస్తృత ప్రాతిపదికపై పనిచేయగలవు.

వ్యవసాయోత్పత్తులను వినియోగించి వస్తూత్పత్తిచేసే విషయంలోకూడా సహకారరంగం ప్రధానమైన పాత్ర వహించగలదు. ఆంధ్ర ప్రాంతంలో అప్పుడే ఈ కృషి కొంతముందుకు పోయినది. విశాఖపట్నం జిల్లాలో ఏటికొప్పాక సహకార చక్కెర ఫ్యాక్టరీ వున్నది. రెండవ ప్రణాళిక క్రింద శ్రీకాకుళం, విశాఖపట్నం, పశ్చిమ గోదావరి, చిత్తూరు, అనంతపురం, నిజామాబాదు జిల్లాలలో మరి అరు సహకార చక్కెర ఫ్యాక్టరీలను నెలకొల్పవలెనని ప్రతిపాదన కలదు. గుంతకల్లులో సహకార నూలుమిల్లు స్థాపించబడింది. ఈమిల్లులో 11 వేల కదుళ్ళున్నవి. ప్రతినెల దాదాపు 500 బేళ్ళ నూలు తయారౌతున్నది. రాయలసీమ ప్రత్తిఉత్పత్తిదారులు తాడిపత్రిలో 12 వేల కదుళ్ళతో మరొక నూలు మిల్లును స్థాపించడానికి కృషి చేస్తున్నారు. ఆంధ్ర ప్రాంతములో మార్కెటింగు సహకార సంస్థల అధ్వర్యాన రెండవప్రణాళిక కాలములో ప్రత్తి, బియ్యం, నూనె మొదలగువాటికి సంబంధించిన మొత్తం 49 మిల్లులను దాదాపు రూ. 20 లక్షలఖర్చుతో స్థాపించడానికై తలపెట్టబడింది. హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలలో ప్రతిరోజూ 500 మణుగుల పరిశుద్ధమైన పాలను సరఫరా చేయడానికై ఆధునికమైన యంత్ర పరకరాలతో ఒక సహకార పాలసరఫరా సంఘాన్ని నెలకొల్పు ప్రయత్నం జరుగుతున్నది. దీనికొరకై 1957-58 సంవత్సరంలో రూ 2.44 లక్షలు వ్యయపరచుటకు తలపెట్టబడింది.

## సహకార ప్రాతిపదికపై వ్యవసాయం

సహకార వ్యవసాయానికి ప్లానింగు కమిషన్ వారు ప్రాధాన్య మిస్తున్నారు. ఆంధ్రప్రాంతంలో ఈ విషయంలో కొంతకృషి జరిగింది. 27 సహకార సేద్యసంఘాలునెలకొన్నవి. దాదాపు 3300 మంది వ్యవసాయ కూలీలు 12 వేల యెకరాల బంజరు భూమిపై సేద్యం చేస్తున్నారు. ప్రయోగాత్మకంగా ప్రతిసామాజికాభివృద్ధికేంద్రంలో, ప్రతిజాతీయవిస్తరణ సేవాకేంద్రంలో ఒక సహకారవ్యవసాయ క్షేత్రాన్ని నెలకొల్పుటకు ప్రయత్నాలు జరుగుతున్నవి. తెలంగాణాలో ఇదివరకే 30 సహకార వ్యవసాయ సంఘాలున్నవి. రెండవ పంచవర్ష ప్రణాళికక్రింద ఆంధ్ర ప్రాంతంలో 15, తెలంగాణా ప్రాంతంలో 38—మొత్తం 53 సహకార వ్యవసాయ క్షేత్రాలను నెలకొల్పవలెనని తలపెట్టబడింది. ఇందుకై రూ. 9.66 లక్షలు కేటాయింపబడ్డవి. సహకార ప్రాతిపదికపై ఉమ్మడి వ్యవసాయాన్ని ప్రోత్సహించడమే ఈ క్షేత్రాల ముఖ్యోద్దేశం.

గ్రామీణ పరిశ్రమలు ఎదుర్కొనే సమస్యలను పరిష్కరించడానికికూడా సహకారవ్యవస్థ ఉపయోగపడుతున్నది. వ్యవసాయం తరువాత మనరాష్ట్రంలో చేనేత వృత్తి ప్రధానమైనది. ఆంధ్రప్రాంతంలో 660 చేనేత పనివారల సహకారసంఘాలున్నవి. ఈ సంఘాలు ఉత్పత్తిచేసే నూలును వస్త్రములను పంపిణీచేసి వారికి సాంకేతికవిషయమైన సలహాల నిచ్చుటకై ఒక కేంద్రసంస్థ ఉన్నది. తెలంగాణాలో కూడా హైదరాబాదు చేనేత పనివారల కేంద్ర సహకారసంఘం కలదు. దీనికి అనేక ప్రాథమిక సంస్థలు కలవు. ఈ రెండు కేంద్రసంస్థల ఏకీకరణ జరిగినట్లయితే ఆంధ్ర ప్రదేశ్‌లో చేనేత పరిశ్రమ చక్కని సహకార వ్యవస్థపై పురోగమించుటకు అవకాశం కలుగుతుంది. లేపు, తివాచీలు, చాపలు, బొమ్మలు, నూలువడుకుట. చర్మకారపని, ఇటుకల తయారీ, నూనెగానుగలు మొదలగు కుటీర, లఘు, గ్రామీణ పరిశ్రమల విషయంలోకూడా సహకార వ్యవస్థ పూర్వకంగా కొంత కృషి జరుగుతున్నది. అట్టి పరిశ్రమల సహకార సంస్థలకు ప్రభుత్వం ఆర్థిక సహాయం చేస్తున్నది. మద్యనిషేధంవల్ల ఆంధ్ర ప్రాంతంలో వృత్తులు పోయినట్టి మాజీ గీతపని వారలకు సహాయపడే నిమిత్తమై దాదాపు 730 తాటిబెల్లపు సహకార సంఘాలు నెలకొల్పబడ్డవి. ఇవి తాటిబెల్లపు తయారీలో 51,600 మందికి పయిగా గీతపనివారలకు పనికల్పిస్తున్నవి. ఆధునిక పద్ధతులప్రకారం తాటిబెల్లమును తయారుచేసే విషయములో కూడాకృషి జరుగుతున్నది. ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలో సహకార గృహనిర్మాణ సంస్థలు నెలకొల్పబడుతున్నవి. ఈసంస్థల కృషివల్ల మునిసిపాలిటీలలో ఇండ్లకొరత సమస్య కొంత

వరకు పరిష్కరించడానికి వీలుకలుగుతున్నది. గృహ నిర్మాణాలకు అప్పు లిచ్చేటందుకై రెండవ ప్రణాళికలో ఒక కోటి రూపాయలు కేటాయింపబడ్డవి.

### శిక్షణ

రెండవ పంచవర్ష ప్రణాళికలో తలపెట్టబడిన సహకార వ్యవస్థ విస్తృతీకరణ దృష్ట్యా ఈ రంగలో పని చేసే కార్యకర్తలకు, నిర్వాహకులకు శిక్షణగడపడం అత్యంతావశ్యక మవుతున్నది. అందుకొరకై తిరుపతిలో కేంద్ర సహకార విద్యాసంస్థ వున్నది. అది గాక సహకార శాఖోద్యోగుల శిక్షణకొరకు హైద్రాబాదు, అనంతపురం, రాజమండ్రి కేంద్రాలలో మూడు శిక్షణ సంస్థలు వున్నవి. సహకార సంఘాల సభ్యులకు, పంచాయితీదార్లకు, కార్య నిర్వాహకులకు సహకార సిద్ధాంతాలు, వాటి ఆచరణ, సంస్థల నిర్వహణ, లెక్కలువ్రాసి వుంచడం మున్నగు విషయాలలో శిక్షణ ఏర్పాట్ల కొరకై రూ. 18 లక్షలు కేటాయింపబడ్డవి. తెలంగాణాలో ఈ శిక్షణ సౌకర్యాలు తగినంతగాలేవు. కనుక తగు ఏర్పాట్లు చేయడానికై రెండవ పంచవర్ష ప్రణాళికలో రూ. 8 లక్షలు కేటాయింపబడ్డవి.

ఈ విధంగా ఆంధ్రప్రదేశ్‌లో అనేక సహకార సంస్థలు నెలకొని సంతృప్తికరంగా కృషిచేస్తున్నవి. అయితే చేయవలసినదింకా ఎంతో వున్నది. రెండవ పంచవర్ష ప్రణాళికలో ఆర్థికాభివృద్ధికి సంబంధించిన ప్రతి అంశంలో కృషిచేయడానికి సహకార సంఘాలు పెద్ద పెద్ద కార్యక్రమాలను చేపట్టనున్నవి. రెండవ ప్రణాళికలో మన వ్యవసాయోత్పత్తిని ప్రస్తుత ఉత్పత్తిపై నూటికి 27 వంతుల చొప్పున హెచ్చించవలెనని ఒకలక్ష్యం నిర్ణయించబడివుంది. ఈ దృష్ట్యా పరపతి, మార్కెటింగు రంగాలలో సహకార వ్యవస్థను ఇతోధికంగా వ్యాప్తం చేయడం అత్యావసరం. ఇది గురుతరమైన బాధ్యత. దీన్ని నెరవేర్చడానికే సహకార సంస్థలు ప్రతి కుటుంబానికీ ఒక సహకార సంఘంలో ప్రాతినిధ్యం కలిగించవలెననే ఉద్దేశంతో పనిచేస్తూ, ఇక ముందునుంచి 'పరపతిగల మనుషు' లకుగాక 'పరపతిగల ప్రయోజనాల'కు అధిక ప్రాముఖ్యం ఇవ్వ సంకల్పించినవి. శ్రేయోరాజ్యంలో సాంఘిక, ఆర్థికాభివృద్ధిని సాధించడానికై, సహకారోద్యమం తలపెట్టిన ప్రధాన లక్ష్యాలను పరిపూర్తి చేయడానికై ఈ ఉద్యమంలో పనిచేస్తున్న వారందరూ తమ విధానాలను పద్ధతులను తగు విధంగా ఏర్పరచుకొని సహకార జనరాజ్యాన్ని నిర్మించాలనే మనదేశ ఉన్నతాదర్శానికి దోహదం చేయగలరని ఆశిస్తున్నాను.

జై హింద్



★

# రాష్ట్ర రాజధానికి అమెరికా రాయబారి రాక

★



*భారత దేశంలో అమెరికా రాయబారి మిస్టర్ ఎల్స్‌వర్త్ బంకర్*

భారతదేశంలో అమెరికా రాయబారి మిస్టర్ ఎల్స్‌వర్త్ బంకర్ సతీసమేతంగా 1957 ఏప్రిల్ 12 వ తేదీన విమానంలో హైద్రాబాదు విచ్చేశారు. బంకర్ దంపతులు ఒక ప్రత్యేక అమెరికన్ విమానంలో మద్రాసునుంచి ఢిల్లీకిపోతూ హైద్రాబాదులో దిగారు. బేగంపేట విమానాశ్రయంలో వారికి ఆంధ్రప్రదేశ్ గవర్నర్ ఆంతరంగిక కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రతినిధులు స్వాగతమిచ్చారు. హైద్రాబాదులోని ఇండియా అమెరికా మైత్రీసంఘం అధ్యక్షులు నవాబ్ జైన్‌యార్జంగ్ బహదూర్, మరి కొందరు ఆసంఘసభ్యులు బంకర్ దంపతులకు పూల మాలలు వేశారు. హైద్రాబాదు నగరంలోవున్న అమెరికన్ పౌరులందరూ విమానాశ్రయానికివచ్చి బంకర్ దంపతులను కలుసుకున్నారు. బంకర్ దంపతులు వారితో కొంతసేపు ఇష్టాగోష్ఠి సల్పారు.

రాష్ట్ర గవర్నర్ శ్రీ సి. యం. త్రివేది వారి సతీమణి శ్రీమతి కుసుంత్రివేది ఏర్పాటుచేసిన విందులో అమెరికా రాయబారి, వారిసతీమణి ప్రముఖ అతిథులుగా పాల్గొన్నారు. రాష్ట్ర ముఖ్యమంత్రి, ఇతర మంత్రులు, ప్రభుత్వ ప్రధానకార్యదర్శి శ్రీ ఓ. పుల్లారెడ్డి, ఇతర ఉన్నతోద్యోగులు కూడా విందుకు విచ్చేశారు.

బంకర్ దంపతులు హైద్రాబాదు నగరం చూచారు. ప్రభుత్వ కుటీరపరిశ్రమల విక్రయశాలలో ఆకర్షణీయమైన చేతిపరిశ్రమల వస్తువులను కొన్నిటిని వారు కొన్నారు. అదేరోజు అపరాహ్ణం మిస్టర్ బంకర్, మిసెస్ బంకర్ ఢిల్లీ వెళ్ళారు.

# ఆంధ్రప్రదేశ్‌లో పట్టణగృహ నిర్మాణ పథకములు

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పారిశ్రామిక కార్మికులకు తక్కువ ఆదాయంగలవారికి, ఊడ్చువారికి, తోట కార్మికులకు, మధ్యతరగతి ప్రజలకు గృహవసతి సౌకర్యాలు కల్పించుటకును, మురికిపేటల నిర్మూలనకు గ్రామీణ ప్రాంతాలలో ఇండ్లు నిర్మించుటకు మొత్తం రూ. 129 కోట్లు కేటాయించ బడినవి.

ద్వితీయప్రపంచ సంగ్రామంవల్లను, దేశ విభజనవల్లను పట్టణ ప్రాంతాలలో ఇండ్లకొరత ఏర్పడింది. అభివృద్ధి కార్యక్రమాలు అమలు కావడంతో పట్టణాల అభివృద్ధికి దోహదం కలుగుతున్నందువల్ల ఇండ్లకొరత ఏయేడు కాయేడు ఎక్కువవుతూన్నది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలో ప్రభుత్వ రంగములోను ప్రయివేటు రంగంలోను 13 లక్షల ఇండ్లు నిర్మించబడి వుంటాయని అంచెనా వేయబడింది. రెండవ ప్రణాళిక కాలంలో కనీసం 19 లక్షల ఇండ్లు నిర్మించడం అవసర మవుతుందని అంచెనా వేయబడింది.

## హైద్రాబాదులో గృహనిర్మాణ పథకం

హైద్రాబాదునగరంలో మురికిపేటలను నిర్మూలించి బీద ప్రజలకు పరిశుభ్రమయిన ఇండ్లు కట్టించుట, ఉన్న రోడ్డులను వెడల్పుచేసి, క్రొత్తగా రోడ్లు వేయుట, నగరాన్ని సుందర నగరముగా మార్చుటకువలసిన పనులను నిర్వహించుట మున్నగు ఆశయాలను సాధించుటకై 1912 సంవత్సరంలో సిటీ ఇంప్రూవుమెంటు బోర్డు అనే పేరుతో ఒక సంస్థ ఏర్పాటు చేయబడింది. ఇట్టి ఆశయాలతోనే 1931 సంవత్సరములో సికింద్రాబాదులో కూడా టౌన్ ఇంప్రూవ్‌మెంటు ట్రస్టు అనే పేరుతో మరొక సంస్థ ఏర్పాటు చేయబడింది.



*తక్కువ ఆదాయం గలవారి కొరకు బర్కత్‌పురాలో నిర్మించబడిన ఇండ్లు.*



ఇండ్ల ముందరి దృశ్యం

## పారిశ్రామిక గృహనిర్మాణ పథకం

ఇది భారతప్రభుత్వం తలపెట్టిన పథకం. 1948 సంవత్సరపు ఫ్యాక్టరీలచట్టం వర్తించు పారిశ్రామిక కార్మికులకు మాత్రమే ఈ పథకంక్రింద భారతప్రభుత్వ సబ్సిడీతో ఇండ్లు నిర్మించబడుతాయి.

భారతప్రభుత్వంవారు రాష్ట్ర ప్రభుత్వాలకు, లేక ప్రభుత్వాలు ఏర్పాటుచేసిన గృహనిర్మాణ సంఘాలకు, ప్రభుత్వోద్యోగులకు, పారిశ్రామిక కార్మికుల రిజస్టరైన సహకార సంఘాలకు సబ్సిడీలు, అప్పుల రూపంలో ఆర్థికసహాయం చేస్తారు ఈ పథకం క్రింద భారత ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకు లేక రాష్ట్రప్రభుత్వాలు ఏర్పాటుచేసిన గృహనిర్మాణ సంఘాలకు 50 శాతం సబ్సిడీగాను మిగిలిన 50 శాతం అప్పులరూపంలోను ఇస్తుంది. ఈ అప్పులు రాష్ట్ర ప్రభుత్వాలనుంచి, పారిశ్రామిక కార్మికుల సహకార సంఘాల నుంచి 25 వార్షిక వాయిదాలలో రాబట్టుకో బడుతాయి.

భారత ప్రభుత్వం ఒక గదిగల ఇండ్ల నిర్మాణానికి ఒక్కొక్క దానికి రూ. 2,260 లు, భూమి ఖరీదుకు రూ. 440 లు, మొత్తం రూ. 2700 లు మాత్రమే ఖర్చు పెట్టాలన్న గరిష్ఠ పరిమితి నిర్ణయించింది.

రెండుగదుల ఇండ్లకు ఈ క్రింది పరిమితి నిర్ణయించబడింది :-

| | | |
|---|---|---|
| భవన నిర్మాణానికి ఖర్చు | ... .... | రూ. 2900 |
| భూమి ఖర్చు | ....... | రూ. 440 |
| | | రూ. 3340 |

పైన పేర్కొనబడిన ఇండ్ల నిర్మాణ ఖర్చులలో నీటి సరఫరా. మురుగునీటి కాలువలు. విద్యుచ్ఛక్తి సౌకర్యాలు చేరివుండవు. వాటిఖర్చును రాష్ట్ర ప్రభుత్వమే భరిస్తుంది: 1951 సంవత్సరంలో రూ. 12 లక్షల ఖర్చుతో 300 ఒంటి గది ఇండ్లు నిర్మించబడినవి. ఇవి అసలు ఖర్చుకు ఆర్. టి. డి. కి విక్రయించబడినవి. ఆ తరువాత పూర్వ హైద్రాబాదు ప్రభుత్వం 1952 - 54 సంవత్సరంలో హైద్రాబాదు నగరంలోను. జిల్లా పట్టణాలలోను 3940 ఒంటిగది ఇండ్లు నిర్మించింది. వీటి వివరాలు :

| | 1952 - 53 కార్యక్రమం | | 1953 - 54 కార్యక్రమం | |
|---|---|---|---|---|
| 1. సనత్‌నగర్ | 700 | ఇండ్లు | 520 | ఇండ్లు |
| 2. ముషీరాబాద్ | 84 | ,, | — | |
| 3. చిక్కడపల్లి | 411 | ,, | — | |
| 4. వరంగల్ | — | | 300 | ఇండ్లు |
| 5. ఖమ్మం | — | | 200 | ,, |
| 6. మరాట్వాడా కర్నాటక ప్రాంతాలు | 525 | | 1200 | ,, |
| మొత్తం | 1720 ఇండ్లు | | 2220 ఇండ్లు | |

పూర్వ హైద్రాబాదు ప్రభుత్వం నిర్మించిన 3940 ఒంటి గది ఇండ్లకు భారత ప్రభుతం మంజూరు చేసిన అప్పులు సబ్సిడీల వివరాలు ఇవి :-

| | 1952 - 53 కార్యక్రమం | 1953 - 54 కార్యక్రమం |
|---|---|---|
| 1. సబ్సిడీ | రూ. 19,98,000 | రూ. 29,97,000 |
| 2. అప్పు | రూ. 19,98,000 | రూ. 29,97,000 |
| | రూ. 39,96,000 | రూ. 59,94,000 |

1952-53 సంవత్సరంలోను 1953-54 సంవత్సరంలోను తలపెట్టిన గృహనిర్మాణపు కార్యక్రమములు పూర్తి చేయ బడినవి.

రాష్ట్రంలోని వివిధ పారిశ్రామిక కేంద్రాలలో సబ్సిడీ పొందుతున్న పారిశ్రామిక గృహనిర్మాణ పథకం క్రింద మూడవ దశలో (1954-55 సం॥ లో) రూ. 55.9 లక్షల ఖర్చుతో 1357 రెండుగదుల ఇండ్లు, 380 ఒంటిగది ఇండ్లు నిర్మించుటకు ప్రభుత్వం నిర్ణయించింది. ఈ పనులన్నీ ఆరంభమై ఇప్పుడు చురుకుగా కొనసాగుతున్నవి. 1956-57 సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలంగాణా కొరకు ఒక పథకాన్ని ఏర్పాటు చేసింది. ఈ పథకం 1957-58 సంవత్సరంలో అమలుపరచ బడుతుంది.

ఈ పథకాలను అమలు పరచుటకు రాష్ట్ర ప్రభుత్వం ఒక క్రొత్తపంథా అవలంబించింది. కార్మిక సహకార సమాఖ్యకు చెందిన ఏజన్సీలద్వారా నిర్మాణపు పనులు నిర్వహించ బడుతాయి. కార్మికుల ఆర్థిక ప్రయోజనాలను సంరక్షించి, దళారీలు, మధ్యవర్తుల ప్రమేయం లేకుండా లాభాలను కార్మికులకు పంచిపెట్టుటకు ఏజన్సీలు కృషి చేస్తాయి.

## తక్కువ ఆదాయం గలవారికి గృహనిర్మాణ పథకం

భారత ప్రభుత్వం తక్కువ ఆదాయం గలవారి కొరకు గృహనిర్మాణ పథకం తయారు చేసింది. ఈ పథకం ప్రకారం కేంద్రం రాష్ట్ర ప్రభుత్వాలకు సాలుకు $4\frac{1}{2}$ శాతం వడ్డీపైన 30 సం. ల అప్పులు ఇస్తుంది. ఈడబ్బు సంవత్స రానికి రూ. 6000 ల లోపు ఆదాయం గలవారికిగాని లేక వారు ఏర్పాటు చేసుకొన్న గృహనిర్మాణ సహకార సంఘాలకుగానీ పంచిపెట్ట బడుతుంది.

ఇట్లా ఇచ్చేఅప్పు భూమితోపాటుకలుపుకొని గృహనిర్మా ణానికయ్యే మొత్తం అసలుఖర్చులో 80 శాతం వుంటుది. అయితే అప్పు గరిష్ఠం రూ. 8000 లకు మించకూడదు.



సనత్ నగర్‌లో పారిశ్రామిక కార్మికుల గృహాలు.



సనత్ నగర్ కాలనీ దృశ్యం.

మిగతా 20 శాతం ఖర్చు ఇండ్లు కట్టదలచినవారు భరించ వలసి వుంటుంది.

1955 సం. లో తక్కువ ఆదాయం గలవారికి ఇండ్లు కట్టించే నిమిత్తమై భారత ప్రభుత్వంవారు పూర్వపు హైద్రాబాదు ప్రభుత్వానికి ఒకకోటి రూపాయలు కేటాయించారు. ప్రథమ ప్రణాళిక ఆఖరు సంవత్సరంలో అంటే 1956మార్చి ఆఖరువరకు ఈడబ్బు గృహనిర్మాణాలకు ఖర్చుపెట్టుటకు ఉద్దేశింప బడినది.

హైద్రాబాదు నగరంలో రూ. 33.99 లక్షల ఖర్చుతో 78 నాలుగుగదుల ఇండ్లు, 107 మూడుగదుల ఇండ్లు, 315 రెండుగదుల ఇండ్లు నిర్మించ బడినవి. సిటీ ఇంప్రూవ్ మెంటు బోర్డువారు తమ పర్యవేక్షణ క్రింద ఈ పనులు పూర్తి చేయించారు. సికింద్రాబాదులో 60 మూడుగదుల ఇండ్లు, 115 రెండుగదుల ఇండ్లు, 50 ఒంటిగది ఇండ్లు నిర్మించ బడినవి. ఇవేగాక జిల్లాలో మొత్తం 1827 మూడు గదుల ఇండ్లు, 603 రెండుగదుల ఇండ్లు నిర్మించ బడినవి.

## కార్పొరేషన్ల కృషి

ప్రభుత్వ ఏజన్సీ ద్వారానేగాక హైద్రాబాదు, సికింద్రాబాదు మునిసిపల్ కార్పొరేషనులు తమ సిబ్బంది కొరకై వరుసగా 200 ఇండ్లు, 100 ఇండ్లు నిర్మించినవి. జిల్లా పట్టణాలలో వివిధ మునిసిపాలిటీలు 300 ఇండ్లు నిర్మించినవి. సహకార గృహనిర్మాణ సంఘాలకు భారత ప్రభుత్వము వారు 1955 - 1956 సంవత్సరములో రూ. 15.80 లక్షల అప్పు మంజూరుచేశారు. ఈ మొత్తం పదిమంది సభ్యులుగల సలహా సంఘంద్వారా హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలోను, జిల్లా పట్టణాలలోను ఉన్న 25 వివిధ సహకార గృహనిర్మాణ సంఘాలకు కేటాయించ బడింది. అప్పులను సహకార గృహనిర్మాణ సంఘాలకు మాత్రమే ఇవ్వాలనీ, వ్యక్తులకు ఇవ్వకూడదనీ నిర్ణయించ బడింది. రెండవ పంచవర్ష ప్రణాళికక్రింద ఈ సంవత్సరం వ్యక్తులకు కూడా అప్పులిచ్చే విషయమై ప్రభుత్వం పరిశీలిస్తున్నది.

తక్కువ ఆదాయం గలవారికి గృహనిర్మాణ పథకం ప్రకారం రాష్ట్ర ప్రభుత్వాలకు 1954 - 55 సం. లో నూటికి సం. రానికి రు. 3¼ ల వడ్డీచొప్పున ప్రత్యేకంగా 3 సం. ల స్వల్పకాలిక ఋణములు ఇవ్వబడినాయి. ఈ డబ్బుతో భూములుకొని ఇండ్లు కట్టించిన తరువాత అవి తక్కువ ఆదాయం గలవారికి అసలుఖర్చుకు విక్రయించ బడుతాయి. ఇందుకొరకు భారత ప్రభుత్వం మంజూరు చేసిన

రూ. 5 లక్షలలో 2 లక్షలు హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలోను, మిగిలిన రూ. 3 లక్షలు జిల్లా కేంద్రాలలోను వినియోగించ బడుతున్నవి.

## ఆంధ్ర ప్రాంతంలో గృహనిర్మాణపు పనులు

ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలో స్థానిక పురపాలక సంఘాలు తక్కువ ఆదాయం గలవారికి 500 ఇంట్లు కట్టించేందుకై భారత ప్రభుత్వంవారు నిర్మాణపు ఖర్చులక్రింద రూ. 13.39 లక్షలు, ఇండ్లు కట్టుటకు భూమికొనుటకై రూ. 5,55 లక్షలు మొత్తం రు. 18.94 లక్షలు ఖర్చు కాగల ఒక పథకాన్ని మంజూరుచేశారు. నిర్మాణపు పనులు చురుకుగా కొనసాగుతున్నవి.

సహకార రంగంలో 527 ఇండ్లు నిర్మించుటకు భారత ప్రభుత్వంవారు రూ, 50.25 లక్షలు ఖర్చుకాగల ఒక పథకాన్ని మంజూరు చేశారు. రాష్ట్ర ప్రభుత్వం సహకార సంఘాలకు రూ. 17.8 లక్షలు పంచిపెట్టింది. పని ఇప్పుడు చురుకుగా కొనసాగుతున్నది.

## ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో తెలంగాణా ప్రాంతంలో సబ్సిడీ పొందుతున్న పారిశ్రామిక గృహ నిర్మాణ పథకంక్రింద రూ. 150.50 లక్షల ఖర్చుతో 400 ఇండ్లు నిర్మించుటకు తలపెట్ట బడింది. ఆంధ్రప్రాంతంలో రూ. 2.9 లక్షలు ఖర్చుకాగల 200 ఇండ్లు నిర్మించ బడుతాయి. ఈ ప్రణాళిక కాలంలో తక్కువ ఆదాయం గలవారి గృహనిర్మాణ పథకంక్రింద తెలంగాణాప్రాంతంలో రూ. 175.45 లక్షల ఖర్చుతో 2300 ఇండ్లు, ఆంధ్ర ప్రాంతంలో రూ. 108.8 లక్షల ఖర్చుతో 1350 ఇండ్లు నిర్మించుటకు తలపెట్టబడింది.

## మురికిపేటల నిర్మూలన

మురికిపేటల సమస్య సాంఘికసమస్య. వాటి వునికివల్ల ఆరోగ్య పరిస్థితులు సక్రమంగా లేవన్నవిషయం ద్యోతకమవుతుంది. మన పథకనిర్మాణంలో ఇట్టి పరిస్థితుల్ని చక్కబరచడానికి అనువుగా వుండాలి. పారిశుధ్యావసరాలు తీర్చని యిళ్లలో నివసించడంవల్ల కార్మికుల ఆరోగ్యం అంత బాగావుండదు. దీనికి సంబంధించినంత వరకూ యిది ఆర్థిక సమస్యకూడా. ఈ రోజులలో వైద్య. సాంఘిక సేవలు ప్రభుత్వపు ప్రథమ బాధ్యతలుగా గుర్తించ బడినవి. గృహవసతి కూడా యిటువంటిదే. ఈ విషయంలో భోర్ కమిటీ (1946) వెలిబుచ్చిన అభిప్రాయం యిది: "పారిశ్రామిక కార్మికుల ఆరోగ్యం విషయంలో మనం ఆలోచించ వలసిన అత్యంత ముఖ్యమైన విషయం గృహవసతి సమస్య. మేము దర్శించిన యేప్రదేశంలోనూకూడా గృహవసతి పరిస్థితులు సంతృప్తికరంగాలేవు. ఈఅన్నిచోట్లకూడా జనం క్రిక్కిరిసి నివసిస్తున్నారు. అంతేకాక చాల సందర్భాలలో, యిళ్ళుకాని, వాటి పరిసరాలు కాని యెంత మాత్రం ఆరోగ్యప్రదంగా లేవు. కార్మికులకు, వారి కుటుంబాలకు ఒకేఒక గదిగల యిళ్ళు చాలునన్న అభిప్రాయంతో యిదివరలో కార్మికుల గృహవసతి పథకాలు పెక్కు రూపొందించబడినవి. అటువంటి యిళ్ళలో మామూలుగా జీవితానికి అవసరమైన సౌకర్యాలను పాటించడం సాధ్యం కాదు. ఆపైన, ఒకగదిలోనేవంట. పడకలు మున్నగు అన్ని అవసరాలకి వాడుకొనవలసి రావడంవల్ల, దానిని కొంచెం శుభ్రంగా, ఆరోగ్య ప్రదంగా వుంచుకొనడం సాధ్యంకాదు. ఇళ్ళు కడుక్కోవడానికీ. స్నానాలు చెయ్యడానికీ తరుచు సౌకర్యాలు వుండవు. మరుగుదొడ్లు కూడా వుండవు. బహిర్దేశానికి వెళ్ళడానికి స్త్రీ పురుషులు నిజంగా ఒక్కొక్కప్పుడు తరుచు చీకటిలో మట్టిరోడ్డులో 2, 3 ఫర్లాంగులు నడచి వెళ్ళవలసి వుంటుంది. వారికిగల యీ అసౌకర్యం వర్షాకాలంలో మరీ యెక్కువగా వుంటుంది." హైదరాబాదు నగరంలో మురికిపేటలలో నివసించేవారు రెండులక్షల మందికి పైనవున్నారు. వీటిలో పెక్కుచోట్ల ప్రజలు మిక్కిలి శోచనీయమైన పరిస్థితులలో నివసిస్తున్నారు. ప్రాథమికావసరాలైన నీటిసప్లై, మురుగు పారుదల,దీపాల సౌకర్యం అసలు లేనేలేదు. మరుగుదొడ్లుకాని, స్నానపు గదులుకాని లేవు, వాడిన నీరంతా యిళ్ళ చుట్టూచేరి, నిలవ వుంటుంది. ఈ మురికిపేటలవల్ల నగరంలో మిగిలిన ప్రదేశాలకి వ్యాధులు వ్యాపిస్తాయి.

నగరంలోని మురికిపేటలు రెండు తరగతులని చెప్పవచ్చును. (1) ధారాళంగా గాలి, వెల్తురు ప్రవేశించని కచ్చా యిళ్ళలో నివసించే ప్రజలు. ఇటువంటి మురికిపేటలు నగరం పాతప్రదేశాలలో వున్నాయి. ఈ యిళ్లు అక్కడ నివసించేవారి స్వంతయిళ్లు. (2) రెండవ రకం గుడిసెలలో అద్దెకుండేవారు.

నగరాభివృద్ధిబోర్డు మురికిపేటల అభివృద్ధికై యించుమించు 15 పథకాలను చేపట్టింది. వాటి అమలు కార్యక్రమం వేర్వేరు ఘట్టాలలో పూర్తి అవుతున్నది.

రాష్ట్ర ప్రభుత్వము, స్థానికసంస్థలు మురికిపేటల అభివృద్ధికై తలపెట్టిన పథకాలను అమలుపరచడంలో వాటికి తోడ్పడ్డానికై కేంద్రప్రభుత్వం 1956 లో ఒక పథకాన్ని రూపొందించింది.

ఈ సందర్భంలో ఆంధ్రప్రదేశ్‌కి ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో రూ. 103 లక్షల్ని యివ్వడానికి కేంద్ర ప్రభుత్వం సమ్మతించింది. ద్వితీయ ప్రణాళిక కాలంలో అమలు జరపడానికై నగరాభివృద్ధిబోర్డు రూ. 26.82 లక్షల వ్యయంపై రెండు ప్రణాళికలను తయారుచేసింది. ప్రణాళిక కాలంలో యీబోర్డు తన మామూలు గ్రాంట్లనుంచి ఖర్చులో 25% సబ్సిడీ యిస్తుంది. కేంద్రంనుంచి లభించే మిగిలిన మొత్తాలను హైదరాబాదు, సికిందరాబాదు కార్పొరేషన్లు, రాష్ట్రంలోని మిగిలిన మునిసిపాలిటీలు వుపయోగించుకుంటాయి. 200 "ఎ" తరగతియిళ్లు, 266 "బి" తరగతి యిళ్లు నిర్మించబడతాయి. మిగిలిన 200 పథకంలో నిర్ణయించబడిన ప్రకారం ఆరోగ్యవసతులుగల ప్లాట్లుగా అభివృద్ధి చేయబడతాయి.

## దోమలగూడా మురికిపేటల అభివృద్ధి పథకం

ఈపథకం (ఖర్చు రూ 1.84లక్షలు) క్రింద రెండంతస్థుల బ్లాకులు 4 నిర్మించ బడతాయి. ప్రతి బ్లాకులోను క్రింద 8, పైన 8 మొత్తం 16 యూనిట్లు వుంటాయి. దోమలగూడాలో వున్న యించుమించు 2 యెకరాలలో యీ యిళ్ళను నిర్మించాలని సంకల్పం. ఈ స్థలం యిప్పుడు నగరాభివృద్ధిబోర్డు స్వాధీనంలోనే వుంది.

ఇళ్ళు నిర్మించాలని తలపెట్టిన పైప్రదేశంచుట్టూ గుడిసెలతో కూడిన మురికిపేటలు చాలా వున్నాయి. దానికి యించుమించు అరమైలు దూరంలో హిమాయత్ నగర్ లోని మురికి ప్రాంతంలో నివసిస్తున్న 64 కుటుంబాలకి యీ క్రొత్తయిళ్ళను యివ్వాలని సంకల్పం.

అందరికీ పూర్తిగా పనికల్పించి, సాంఘికసంక్షేమం స్థాయిని పెంపొందించదలచే దేశాలన్నికూడా పని జరుగవలసిన ముఖ్యమైన పబ్లిక్ రంగాలలో గృహవసతి ఒకటని భావిస్తాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు యీ సమస్య ప్రాధాన్యతను గురించి పూర్తిగా తెలుసును, అది వేగంగా పరిష్కరించ బడాలని కూడా తెలుసును. పరిస్థితిని చక్కబరచడానికి అవి తమ శక్తివంచన లేకుండా పని చేస్తున్నాయి.

★ ★ ★ ★



# ★ నాగార్జునసాగర్ చిత్రాలు ★



నాగార్జునకొండవద్ద త్రవ్వకాలలో క్రొత్తగా బయల్పడిన పురావస్తు విశేషాలను
రాష్ట్రమంత్రి శ్రీ జె. వి. నరసింగరావుగారు పరిశీలిస్తున్నారు.



నాగార్జునసాగర్ డాము వద్ద పని జరుగుతున్న దృశ్యం.

# భద్రాచలం పడవ ప్రమాదం చిత్రాలు



భద్రాచలం పడవ ప్రమాదంలో బ్రతికి బయటపడి ఆసుపత్రిలో కోలుకుంటున్న ఒక స్త్రీని రాష్ట్ర విద్యామంత్రి పరామర్శిస్తున్నారు.



ఇటీవల భద్రాచలంవద్ద గోదావరి పడవ ప్రమాదంలో నీటిలో మునిగిపోయిన రెండుపడవలలో ఇది ఒకటి.

# క్రొత్తగా 25 జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం క్రొత్తగా మరి 25 జాతీయ విస్తరణ సేవా కేంద్రాలను రాష్ట్రం లోని 15 జిల్లాలలో ఈ క్రింది పేర్కొనబడిన ప్రదేశాలలో నెలకొల్పుటకు నిర్ణయించింది.

శ్రీకాకుళం : పాతపట్నం తాలూకాలోని సర్వ కోటలో ; నరసన్నపేట తాలూకాలోని ఉర్లంలో.

విశాఖపట్నం : భీమునిపట్నం తాలూకాలోని తగరపువలసలో, నర్సీపట్నం తాలూకాలోని గోలుగొండలో.

పశ్చిమగోదావరి : తాడేపల్లిగూడెం తాలూకాలోని పెంటపాడులో.

కృష్ణా : కైకలూరు తాలూకాలోని కలిదిండిలో; బందరు తాలూకాలోని గూడూరులో.

గుంటూరు : సత్తెనపల్లి తాలూకాలోని రాజుపాలెంలో తెనాలి తాలూకాలోని ఈమనిలో, రేపల్లె తాలూకాలోని పల్లపట్లలో.

నెల్లూరు : వెంకటగిరి తాలూకాలోని బంగారుపేటలో, దర్శితాలూకాలోని కురిచేడులో.

చిత్తూరు : పుత్తూరు తాలూకాలోని కార్వేటి నగరంలో, పలమనేరు తాలూకాలోని రామకుప్పంలో.

కడప : కమలాపురంతాలూకాలోని ఎర్రగుంట్లలో.

అనంతపురం : హిందూపురం తాలూకాలోని గోరట్లలో.

ఆదిలాబాదు : ఉట్నూరు తాలూకాలోని ఉట్నూరులో, ఖానాపూరు తాలూకాలోని కదంలో.

మహబూబు నగర్ : షాద్‌నగర్ తాలూకాలోని కోమదుర్గులో, కల్వకుర్తి తాలూకాలోని ఆమనగల్లులో.

హైద్రాబాదు : వికారాబాదు తాలూకాలోని మోమిన్‌పేటలో.

వరంగల్లు : నర్సంపేట తాలూకాలోని నర్సంపేటలో.

నల్లగొండ : సూర్యాపేట తాలూకాలోని మూసీ బ్లాకు.

ఖమ్మం : పాలేరు (2) ఖమ్మంతాలూకాలో, వైరా (2) మధిర తాలూకాలో.

క్రొత్తగా ఈ కేంద్రాలు నెలకొల్పబడటంతో రాష్ట్రంలోని జాతీయవిస్తరణ సేవాకేంద్రాలసంఖ్య 85 అవుతుంది. ఇదివరకే 63 జాతీయవిస్తరణసేవా కేంద్రాలు, 18 అనంతరకృషి కేంద్రాలు, 40 సామూజికాభివృద్ధి బ్లాకులు, 4 బహుళార్థసాధక ప్రాజెక్టులు, 32,380 చదరపుమైళ్ళ విస్తీర్ణంలో 9329 గ్రామాలలో, 97.77 లక్షల జనాభాకు వర్తిస్తూ వున్నవి.

క్రొత్తగా నెలకొల్పబడే ఈ 25 కేంద్రాలు 1957 ఏప్రిల్ 1 వ తేదీనుంచి నెలకొన్నట్లుగా భావింపబడగలవు. వీటికి సంబంధించిన కార్యక్రమాన్ని అమలుపరచ వలసిందిగా ఆయా జిల్లాకలెక్టర్లకు ఉత్తర్వు లివ్వబడ్డవి.



# అభివృద్ధి కేంద్రాలలో జరుగుతున్న కృషి



తెలంగాణా ప్రాంతంలో 1956-57 లో ప్రారంభింప బడిన అయిదు సామాజికాభివృద్ధి బ్లాకులలో 1957 జనవరి నెలలో ప్రజలనుండి రూ. 3,300 ల సహాయం లభించింది. ఇదేకాలంలో ఈ బ్లాకులపై ప్రభుత్వం పెట్టిన ఖర్చు రూ. 8,380 లు. ఈ నెలలో సదాశివపేట, ఆదిలాబాదు సామాజికాభివృద్ధి బ్లాకులలో రెండు గ్రామనాయకుల శిక్షణ శిబిరాలు నడుపబడ్డవి. సదాశివపేట శిబిరానికి రాష్ట్ర విద్యుచ్ఛక్తి నీటిపారుదల శాఖామంత్రి 30-1-1957 తేదీన ప్రారంభోత్సవం జరిపారు. ఈ శిబిరంలో పదిగ్రామాల నుంచి వచ్చిన అభ్యర్థులకు శిక్షణ ఇవ్వబడింది. ఈ బ్లాకులలో జరిగిన మరొక విశేషమేమిటంటే యూనియన్ ప్రభుత్వ సామాజికాభివృద్ధి మంత్రి షాద్‌నగర్ సామాజికాభివృద్ధి బ్లాకును సందర్శించిన సందర్భంలో బాలానగర్‌లో ఒక కమ్యూనిటీ హాలు (గ్రామమందిరం) కు గృహప్రవేశోత్సవం జరిపారు.

1956-57 సంవత్సరపు తాలూకు అయిదు బ్లాకులు తెలంగాణాలో ఈ క్రిందిచోట్ల నెలకొల్పబడ్డవి: షాద్‌నగర్, సదాశివపేట, హైద్రాబాదు పడమర, పెద్దపూరు, ఆదిలాబాదు. ఈ బ్లాకులలో 1957 జనవరి నెలలో జరిగిన అభివృద్ధి కార్యక్రమాలు దిగువ సంక్షిప్తంగా వివరింప బడ్డవి:

## వ్యవసాయం

అయిదు బ్లాకులలో 1,821 మణుగుల మేలిరకం విత్తనాలు, 7,046 మణుగుల రసాయనిక ఎరువులు, 155 మేలి రకం వ్యవసాయ పనిముట్లు పంచిపెట్టబడ్డవి. 5,102 ఎకరాల భూమి జపానుపద్ధతి వరిసేద్యం క్రిందికి తేబడింది. 1,105 ఎరువు గుంటలు, 1,075 కంపోస్టు ఎరువుగుంటలు త్రవ్వబడ్డవి. అదనంగా 258 ఎకరాల భూమి సాగుక్రిందికి తేబండిది. 549 ఎకరాల భూమి సాగుకు వీలుగా బాగు చేయబడింది.

15 మంచినీటి బావులు త్రవ్వబడ్డవి. 74 బావులకు పూడిక తీసి బాగుపరచనైనది. 306 పొగరాని పొయ్యిలు నిర్మింపబడ్డవి.

కొత్తగా 8 పాఠశాలలు తెరువబడ్డవి. సాధారణ పాఠశాలలు అయిదింటిని బేసిక్ పాఠశాలలుగా మార్చడమైనది.

## రాకపోకల సౌకర్యాలు

4 మైళ్ళ రెండు ఫర్లాంగుల కచ్చారోడ్లు వేయబడ్డవి. 7 మైళ్ళ పక్కారోడ్లు 6 మైళ్ళ 2 ఫర్లాంగుల పక్కారోడ్లు మరమ్మతు చేయబడ్డవి.

ఈ బ్లాకులలో కొత్తగా అయిదు సహకార సంఘాలు ప్రారంభించబడ్డవి. 307 మంది కొత్త సభ్యులు చేర్చుకోబడ్డారు.

ఈ అయిదు బ్లాకులనూ అవి సాధించిన ఫలితాలను బట్టి ఈ దిగువ ప్రాధాన్యక్రమం ఇవ్వబడింది.

1. షాద్‌నగర్, 2. సదాశివ పేట, 3. హైదరాబాదు పడమర, 4. పెద్దపూరు, 5. ఆదిలాబాదు.

## వాయల్పాడు, ఇచ్ఛాపురం సామాజికాభివృద్ధి బ్లాకుల ప్రమాణీకరణ

1957 ఏప్రిల్ 1 వ తేదీనుంచి వాయల్పాడు, ఇచ్ఛాపురం సామాజికాభివృద్ధి బ్లాకులు ప్రమాణీకరణం చేయబట్టవి. కనుక ఇక వాటిలో తీవ్రంగా అభివృద్ధికృషి జరుగుతుంది. ఆంధ్రప్రాంతంలో ప్రారంభించబడిన బ్లాకులలో ఇవి మొట్ట మొదటివి. ఇవి చిత్తూరు, శ్రీకాకుళం జిల్లాలలో వున్నవి.

అభివృద్ధి బ్లాకు ప్రమాణీకరణ అంటే దానిని కొన్ని చిన్న బ్లాకులుగా విభజంచి, వాటిలో తీవ్ర కృషి తలపెట్టబడుతుంది. ఇందువల్ల పనికూడా సులభ మవుతుంది. పెద్ద బ్లాకు అయ్యే సరికి అది అలవిగాకుండా వుంటుంది. విభజన తరువాత అభివృద్ధి కార్యక్రమం విస్తృతంగా జరుగడానికి వలను పడుతుంది. ప్రమాణీకరణ తర్వాత వాయల్పాడు సామాజికాభివృద్ధిబ్లాకు మూడు తీవ్రకృషిబ్లాకులుగా విభజింపబడుతుంది. 1. వాయిల్పాడు, 2. కలికిరి, 3. చింగొత్తిగొల్లు. ఇచ్ఛాపురంబ్లాకు ఒకటిగానే వుంటుంది. వాయల్పాడు బ్లాకులు మూడింటిలో 123 గ్రామా లుంటాయి. వాటి జనాభా

1,86,498. ఇచ్ఛాపురం బ్లాకు విస్తీర్ణం 88 చదరపు మైళ్ళు. అందులో 51 గ్రామా లుంటాయి. వాటిజనాభా 78,761.

వాయల్పాడు సామాజికాభివృద్ధి బ్లాకులో 1857 మార్చి నెల వరకు ఈ దిగువ పేర్కొనబడిన అభివృద్ధి సాధింప బడింది.

19,257 మణుగుల మేలిరకం విత్తనాలు, 1,921 మేలి రకం వ్యవసాయ పనిముట్లు రైతులకు సరఫరా చేయబడి నవి. 413 ఎకరాల విస్తీర్ణంలో ప్రాథమిక, సెకండరీ విత్త నాల క్షేత్రాలు నెలకొల్ప బడ్డవి. 3,511 ఎరువుగుంటలు, 2,023 కంపోస్టు గుంటలు త్రవ్వబడ్డవి. 14 బావులను మర మ్మతు చేసి, ఆరు ఫిల్టర్ పాయింట్లను పెట్టి అదనంగా 37 ఎకరాలకు సాగునీరు లభింప జేయబడింది. జపాను పద్ధతి వరి సేద్యాన్ని రైతులకు చూపెట్టడానికై 40 ప్రదర్శనలు ఏర్పాటు చేయబడ్డవి. 17,086 ఎకరాలలో జపాను పద్ధతి వరిసేద్యం ప్రవేశపెట్ట బడింది. 11,025 పెరటి తోటలు వేయబడ్డవి. 510 ఎకరాలలో పండ్లతోటలు వేయబడ్డవి.

మూడు బహుళార్ధ సాధక సహకార సంఘాలు ప్రారం భింప బడ్డవి. వీటిలో 1427 మంది సభ్యులున్నారు ఇటీవల చర్మకారుల కొరకై కుటీర పరిశ్రమల సహకార సంఘం ఒకటి 46 మంది సభ్యులతో, రూ 500 ల పెట్టుబడితో స్థాపించ బడింది.

## రాకపోకల సౌకర్యాలు

32 మైళ్ళ పక్కా, కచ్చా రోడ్లు వేయబడినవి. 114 మైళ్ళ పక్కా, కచ్చా రోడ్లు మరమ్మతుచేయబడినవి. ఇవి గాక చిన్నచిన్న వంతెనలు 11 నిర్మింప బడ్డవి.

కొత్తగా అయిదు పాఠశాలలు తెరువ బడినవి. 46 సాధారణ పాఠశాలలు బేసిక్ పాఠశాలలుగా మార్చబడినవి.

24 బావులు త్రవ్వ బడినవి. 150 బావులు మరమ్మతు చేయబడినవి.

బ్లాకు నిర్వహణ ఖర్చుకై ప్రజలు తమవంతు సహాయ ముగా రూ 53,600 లు ఇచ్చారు. ప్రభుత్వం పెట్టిన ఖర్చు రూ 13,70,981 లు.

ఈ బ్లాకులో 1957 మార్చి నెలలో జరిగిన మరొక విశేష మేమిటంటే 50 మంది గ్రామస్థులకు (వారిలో అయిదుగురు స్త్రీలు కూడా వున్నారు) గ్రామ నాయకుల శిక్షణ శిబిరం నిర్వహించ బడింది. అంతేగాక దేశంలో కొత్తగా ప్రవేశ పెట్టబడిన దశాంశ పద్ధతి నాణెములకు ప్రచార మివ్వడానికై ఫిలిం ప్రదర్శనలు చూపెట్టబడ్డవి.

## అరకు, హుకుంపేట బహుళార్ధ సాధక ప్రాజెక్టులు

అరకు, హుకుంపేట బహుళార్ధ సాధక ప్రాజెక్టుల ప్రజలు ఒక ప్రాథమిక ఆరోగ్యకేంద్రం కొరకు, ఒక నివాస వసతిగల పాఠశాలకొరకు ఒక్కొక్కరు 3 ఎకరాల చొప్పున భూమి ఇచ్చారు. అంతేగాక అరకు ప్రజలు అభి వృద్ధి కార్యక్రమం ఖర్చులో తమ వంతుగా దాదాపు రూ. 2,500 లు విరాళ మిచ్చారు.

ఈ రెండు బ్లాకులలో 1-4-1956 తేదీనుంచి 28-2-1957 తేదీవరకు ఈదిగువ కార్యక్రమాలు అమలు జరిగినవి :

అరకుప్రాజెక్టులో రైతులకు 1,131 మణుగుల మేలి రకం విత్తనాలు, 157 మణుగుల రసాయనిక ఎరువులు, 239 మేలిరకం వ్యవసాయ పనిముట్లు సరఫరా చేయబడి నవి. 1,008 ఎరువు గుంటలు, 510 కంపోస్టు గుంటలు త్రవ్వబడినవి. 145 ఎకరాల విస్తీర్ణంలో జపానుపద్ధతి వరిసేద్యం ప్రవేశపెట్టబడింది. హుకుంపేట ప్రాజెక్టులో రైతులకు 119 మణుగుల విత్తనాలు, 3,528 మణుగుల రసాయనిక ఎరువులు సరఫరా చేయబడ్డవి. 1,790 ఎరువు గుంటలు, 407 కంపోస్టు గుంటలు త్రవ్వబడినవి. 80 ఎక రాలలో జపాను పద్ధతి వరిసేద్యం ప్రవేశపెట్టబడింది. అర కులో 476 ఎకరాలు, హుకుంపేటలో 360 ఎకరాలు కొత్తగా సాగుకు లాయకు చేయబడినవి.

అరకు ప్రాజెక్టు ప్రాంతంలో త్రాగే మంచినీటిబావులు 12, హుకుంపేట ప్రాంతంలో 2 త్రవ్వబడినవి.

## విద్య

అరకు ప్రాజెక్టులో కొత్తగా పది పాఠశాలలు, హుకుం పేట ప్రాజెక్టులో 8 పాఠశాలలు నెలకొల్ప బడినవి. అరకు ప్రాంతంలో 5 సాధారణ పాఠశాలలను, హుకుంపేట ప్రాంతంలో 3 సాధారణ పాఠశాలలను బేసిక్ స్కూళ్ళుగా, మార్చనైనది.

2 సహకార సంఘాలు నెలకొల్ప బడినవి. వాటి సభ్యత్వం 1,428.

ఈ సమీక్ష కాలంలో ప్రభుత్వం అరకు ప్రాంతంపై రూ. 16,097 లు, హుకుంపేట ప్రాంతంపై రూ. 4,359లు ఖర్చుపెట్టింది.

## వేములకుర్తి శిక్షణ శిబిరం

గోదావరికి సమీపంలో, మెట్పల్లి జాతీయ వికాసకేంద్రానికి చెందిన వేములకుర్తి గ్రామంలో 1957 మార్చి 24 వ తేదీ నుంచి నాలుగు రోజులపాటు గ్రామనాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది.

ఈ శిబిరంలో ప్రతిరోజూ శిక్షణపొందేవారు శ్రమదానం చేయడం, డెవలెప్‌మెంటు అధికారులు ఉపన్యాసాలివ్వడం, ప్రదర్శనలు, ఆటలు, వైజ్ఞానిక ప్రదర్శనములు మొదలగు కార్యక్రమాలు అమలు జరిగాయి. మరొక విశేషమేమిటంటే ఈ శిబిరంలో ఆధునిక భావాలుగల ఒక రైతు మేలిరకం వ్యవసాయ పద్ధతుల అవలంబనలో తనకు కలిగిన అనుభవాలను శిక్షణ పొందుతున్న ఇతర రైతులకు చక్కగా వివరించి చెప్పాడు.

## దేవులపల్లిలో

వాయల్పాడు సామాజికాభివృద్ధి బ్లాకుకు సంబంధించిన దేవులపల్లి గ్రామంలో మార్చి 26 వ తేదీ నుంచి నాలుగు రోజులవరకు గ్రామనాయకుల శిక్షణ శిబిరం నడుపబడింది. 18 గ్రామాల నుంచి మొత్తం 60 మంది అభ్యర్థులను ఎన్నిక చేసి ఈ శిబిరంలో శిక్షణ ఇవ్వడమైనది. అభ్యర్థులలో పంచాయితీల సభ్యులు, సహకార సంఘాల సభ్యులు, సంఘ సేవకులు, హరిజనులు కూడా వున్నారు. వాయల్పాడు బ్లాకులో నిర్వహింపబడిన శిబిరాలలో ఇది తొమ్మిదవది.

శ్రమదానం, ప్రదర్శనలు, గ్రామీణ జీవితంపై ఉపన్యాసాలు ఈ శిబిరంలో అమలు జరిగిన కార్యక్రమాలలో చెప్పుకోదగినవి. అభ్యర్థులు తమ శ్రమదానంగా గ్రామం కొరకు ఒక నమూనా పశువుల కొట్టమును, పొగరాని పొయ్యిలను నిర్మించారు. శిబిర కార్యక్రమంలో సాయంత్రం పూట వైజ్ఞానిక ప్రదర్శనములు జరిగేవి.

ఈ సందర్భంలో ఒక వస్తు ప్రదర్శనం కూడా ఏర్పాటు చేయబడింది. అందులో మేలిరకం వ్యవసాయ పనిముట్లు, పశుపోషణ మొదలగు వాటికి సంబంధించిన ఆధునిక పరికరములు, కరపత్రాలు, గోడ పోస్టర్లు, పటాలు, ఇతర నమూనాలు ప్రదర్శింప బడ్డవి.

నిజాంసాగర్ సామాజికాభివృద్ధి ప్రాజెక్టు క్రింద బాన్సువాడా తాలూకాలోని మహమ్మద్ నగరంలో 21-3-1957 తేదీన గ్రామ నాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది. 1957 మార్చి 22 వ తేదీన జెండా ప్రతిష్ఠాపన, హరిజనవాడలో శ్రమదానం జరిగాయి. ఆతరువాత మూడు రోజులవలకు రోజూ శ్రమదాన కార్యక్రమం జరిగింది. ఆధునిక వ్యవసాయ పద్ధతులు, పొగరాని పొయ్యి, సహకారం, ఆరోగ్య విద్య, పశు సంరక్షణ, పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన ప్రదర్శనలు ఏర్పాటు చేయబడినవి. ఉపన్యాసా లివ్వబడినవి. ప్రభుత్వ శాఖలు ఎగ్జిబిషన్‌స్టాల్సు ఏర్పాటు చేశాయి. ప్రతిరోజు వందలాది గ్రామస్థులు శిబిరాన్ని సందర్శించి ప్రదర్శనలు చూచారు.

## తెలంగాణాలో జాతీయ విస్తరణ సేవాకేంద్రాలు

తెలంగాణా ప్రాంతంలో 1956-57 లో నెలకొల్పబడిన 8 జాతీయ విస్తరణ సేవా కేంద్రాలలో నిర్వహించబడిన అభివృద్ధి కార్యకలాపాలలో, రెండు గ్రామనాయకుల శిక్షణ శిబిరాలు నిర్వహించబడటం, ప్రజలనుంచి రూ. 43,250 ల మొత్తాన్ని విరాళంగా సేకరించడం ముఖ్యంగా పేర్కొనదగినవి. ఈ గ్రామనాయకుల శిక్షణ శిబిరాలలో 81 మంది గ్రామీణులు పాల్గొన్నారు. మితవ్యయాన్ని ప్రోత్సహించడానికై 100 హుండీ డబ్బాల పంపిణీద్వారా మరో రూ. 745 ల మొత్తంకూడా సేకరించబడింది. లక్సెట్టిపేట జాతీయ విస్తరణ సేవా కేంద్రంలోగల చింతగూడాలో ఆయుర్వేద చికిత్సాలయానికి విద్యుచ్ఛక్తి నీటి వనరులశాఖ మంత్రి శంకుస్థాపన చేశారు.

దుండిగల్, నర్సాపూర్, కొల్లాపూర్, మహబూబాబాద్, హుజూరాబాద్, బూర్గుంపాడు, భువనగిరి, లక్సెట్టిపేట కేంద్రాలలో జరిగిన అభివృద్ధి పనులకు సంబంధించిన వివరాలు దిగువ ఇవ్వబడినవి.

## వ్యవసాయం, పశుపోషణ

1957 జనవరి నెలలో 940 మణుగుల మేలిరకం విత్తనాలు, 3,531 మణుగుల ఎరువులు, 80 ఆధునిక వ్యవసాయ పరికరాలు పంచిపెట్టబడినవి. 887 సాంస్కృతిక ప్రదర్శనలు మొదలగునవి నిర్వహించబడినవి. 1,744 ఎకరాలలో జపానుపద్ధతి వరిసేద్యం ప్రవేశపెట్టబడింది. 914 ఎరువుగుంటలు, 493 కంపోస్టు గుంటలు త్రవ్వబడినవి. 178 ప్రదర్శన క్షేత్రాలు, 992 పెరటితోటలు వేయబడినవి. 92 ఎకరాలలో నీటిపారుదల సౌకర్యాలు కల్పించబడినవి. 129 ఎకరాలు సాగుక్రిందికి తేబడినవి. 308 పశు

వులకు విత్తులు కొట్టబడినవి. 64 మేలుజాతి పశువులు సరఫరా చేయబడినవి.

## ఆరోగ్యం, పారిశుద్ధ్యం

జనవరి నెలలో 22 మంచినీటి బావులు త్రవ్వబడినవి. 13 నూతులు బాగుచేయబడినవి. 381 మురికి గుంటలు త్రవ్వబడినవి. 88 మరుగుదొడ్లు నిర్మించబడినవి. 10 న్నర మైళ్ళ పొడవున మురుగుకాలువలు వేయబడినవి.

## విద్య

ప్రజాసంఘాలకు సంబంధించిన 43 యూనిట్లు అభివృద్ధి పరచబడినవి. 35 సామాజిక కేంద్రాలు తెరవబడినవి. 37 వయోజన విద్యా కేంద్రాలద్వారా 1,055 మంది వయోజనులు అక్షరాస్యులుగా చేయబడినారు.

## రవాణా

ఈ నెలలో ఈ మొత్తం కేంద్రాలలో రెండుమైళ్ళ రెండు ఫర్లాంగుల పొడవుగల పక్కా రోడ్లు, 23 మైళ్ళ 5 ఫర్లాంగుల కచ్చా రోడ్లు వేయబడినవి. 4 మైళ్ళ. 2ఫర్లాంగుల కచ్చారోడ్లు మరమ్మతు చేయబడినవి.

ఈ నెలలో 16 సహకార సంఘాలు ప్రారంభించబడినవి. 499 మంది కొత్తగా సభ్యులుగా చేర్చుకోబడినారు.

పై ఎనిమిది జాతీయ విస్తరణ సేవా కేంద్రాలకు, ఆయా కేంద్రాలు నిర్వహించిన కార్యకలాపాలను అనుసరించి దిగువ విధంగా స్థానాలు ఇవ్వబడినవి.

1. దుండిగల్, 2. నర్సాపూర్, 3. కొల్లాపూర్, 4. మహబూబాబద్, 5. హుజూరాబాద్, 6. బూర్గుంపాడు, 7. భువనగిరి. 8. లక్సెట్టిపేట.

## ప్రభుత్వం పెట్టిన ఖర్చుకంటె ప్రజలు చేసిన సహాయం మూడురెట్లు

ఆంధ్ర ప్రాంతంలో నార్మలైజ్ చేయబడిన 12 బ్లాకులలోనూ అభివృద్ధి పథకాల అమలుకై ప్రజల వంతుగా 1957 ఫిబ్రవరి నెలలో రూ. 1,68,018 వసూలు అయినవి. ఈ కాలంలో ప్రభుత్వం ఖర్చు చేసిన సొమ్ము రూ. 37,354 కంటె ఇలా ప్రజల నుంచి వసూలైన యీ సొమ్ము మూడు రెట్లు అధికం. ఫిబ్రవరి నెలలో బ్లాకు అభివృద్ధి పనిలో జరిగిన మరొక విశేష మేమంటే, యీ 12 బ్లాకులలోని గ్రామీణుల నుంచి యీ నెలలో రూ. 1,37,390 నిలవగా వసూలు చేయబడ్డాయి. వారికి 766 హుండీ పెట్టెలు పంచిపెట్ట బడ్డాయి. 1957 ఫిబ్రవరిలో యీ బ్లాకులలో జరిగిన కృషినిగురించి ప్లానింగు, అభివృద్ధిశాఖ సమర్పించిన నివేదిక ప్రకారం లక్ష్మీ నరసాపురం, గొల్లపాలెములలోనూ, రాయవరం బ్లాకులోనూ మొత్తం 3 గ్రామనాయకుల శిక్షణ శిబిరాలు నడపబడినవి. వాటిలో మొత్తం 122 మంది గ్రామీణులకు శిక్షణ యివ్వబడింది. వారిలో 12 మంది స్త్రీలు వున్నారు. ఒక పశు ప్రదర్శనము, ఒక వస్తు ప్రదర్శనము, ఒక మేలా - ప్రదర్శనము కూడా యేర్పాటు చేయబడినవి. ఆంధ్ర ప్రాంతంలో నార్మలైజ్ చేయబడిన యీ 12 బ్లాకులు - రాయవరం, కపిలేశ్వరపురం, చోడవరం, పిఠాపురం, గొల్లప్రోలు, సామర్లకోట, గొల్లపాలెం, కిర్లంపూడి, ఎమ్. డి. నగరం, నంద్యాల, చెన్నూరు, మైదుకూరులలో జరిగిన కృషిని గురించిన నివేదిక ప్రకారం 21,555 మణుగుల వుత్తమ విత్తనాలు, 63.691 మణుగుల రసాయన యెరువులు, 760 ఆధునిక పరికరాలు పంచిపెట్టబడినవి. 16,694 యెకరాలలో జపాను పద్ధతి వరిసాగు ప్రవేశ పెట్టబడింది. 3,073 యెకరాలు సాగుక్రిందికి తేబడినవి. 1,216 యెకరాలు బాగుచేయ బడినవి. 3,102 యెరువు గుంటలు, 831 పెంట యెరువుగుంటలు త్రవ్వ బడ్డాయి, 3,859 ప్రదర్శన, ప్రయోగాత్మక ప్లాట్లు వేయబడినవి. 660 యెకరాలలో ఫలవృక్షాలు, కూరగాయల మొక్కలు నాట బడ్డాయి. 2,504 యింటి తోటలు వేయబడినవి.

## ఆంధ్రలో జాతీయ విస్తరణ సేవాకేంద్రాలు

ఆంధ్ర ప్రాంతంలో 1055-56 సంవత్సరపు తాలూకు 6 జాతీయ విస్తరణ సేవా కేంద్రాలలో 1957 ఫిబ్రవరిలో జరిగిన కృషిపై ప్లానింగు, అభివృద్ధిశాఖ తయారు చేసిన నెలసరి నివేదిక ప్రకారం ఖర్చులో ప్రజల వంతుగా రూ. 21,054 లు, నిల్వలుగా రూ, 16,682 లు వసూలయినవి. దేవరకొండ ప్రజలు కమ్యూనిటీహాలు నిర్మాణం నిమిత్తం 10 సెంట్ల భూమిని, ఆటస్థలానికి, పిల్లల పార్కుకి 33 సెంట్ల భూమిని విరాళ మిచ్చినట్లుగా కూడా ఆ నివేదికవల్ల తెలుస్తున్నది. ఈ నెలలో యీ ఆరు బ్లాకుల లోనూ ప్రభుత్వం రూ. 76,504 ఖర్చు చేసింది. మూడు శిక్షణ శిబిరాలుకూడా యేర్పాటు చేయబడినవి. వీటిలో 122 మంది గ్రామీణులకి గ్రామనాయక శిక్షణ యివ్వబడింది. ఈ ఆరు బ్లాకులు ఇవి ; కోసిగి, దేవరకొండ, నందవరం, పెద్దతుంబళం, మాచెర్ల, తలుపుల.

(మిగతా 57 వ పేజీలో)



ఆంధ్రప్రదేశ్ శాసనసభ
డిప్యూటీ స్పీకర్

# శ్రీ లక్ష్మణ్ బాపూజీ కొండా



ఆంధ్రప్రదేశ్ శాసనసభకు డిప్యూటీ స్పీకరుగా ఎన్నుకోబడిన శ్రీ లక్ష్మణ్ బాపూజీ కొండా (సాధారణంగా వీరిని కొండా లక్ష్మణ్ అని అంటారు.) ఆదిలాబాదుజిల్లా ఆసిఫాబాదు తాలూకాలోని వంకిడి గ్రామంలో జన్మించారు. వీరి వయస్సు దాదాపు 40 ఏండ్లు. మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులైన తరువాత 1940 లో ప్లీడరు డిప్లొమాపొంది 1944 లో హైద్రాబాదులో ఫస్టుక్లాసు వకీలుగా ప్రాక్టీసుపెట్టారు. సత్యాగ్రహంలో పాల్గొని జైలుకు వెళ్ళారు. వందేమాతరం ఉద్యమంలోను, 1942 కాంగ్రెసు మహోద్యమంలోనూ పాల్గొన్నారు. స్టేటు కాంగ్రెసు స్థాయీ సంఘ సభ్యులుగా వున్నారు. కాంగ్రెసు సంస్థలో వివిధ పదవులలో పనిచేశారు, చాలాకాలంనుంచి చేనేత పనివారల సంస్థతో సన్నిహిత సంబంధం కలిగి వున్నారు. రాష్ట్ర చేనేత కాంగ్రెసు, హైద్రాబాదు చేనేత పనివారల కేంద్ర సహకారసంఘం, పద్మశాలి మహాసభలకు అధ్యక్షులు. అఖిలభారత చేనేత పనివారల సంఘ సభ్యులు. హైద్రాబాదులోని ఫెడరేషన్ ఆఫ్ ఇండస్ట్రియల్ కోఆపరేటివ్స్ అను సంస్థకు డైరెక్టరుగానూ, రిప్రజెంటేటివ్‌గానూ, వున్నారు.



# ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభ్యులు



| సం. | పేరు | నియోజకవర్గము | పార్టీ |
|---|---|---|---|
| 1. | శ్రీ అచ్యుతరెడ్డి | కొడంగల్ | కాంగ్రెసు |
| 2. | ,, బొట్సా ఆదినారాయణ | భోగాపురం | సోషలిస్టు |
| 3. | శ్రీమతి చోడగం అమ్మన్నరాజా | అత్తిలి | కాంగ్రెసు |
| 4. | శ్రీ అమృత లాల్ శుక్లా | సిరిసిల్ల | పి. డి. ఎఫ్. |
| 5. | ,, జగినపల్లి ఆనందరావు | మెట్టుపల్లి | ,, |
| 6.. | ,, అనంతరెడ్డి | దొమ్మట | ,, |
| 7. | ,, టి. అంజయ్య | ఆర్మూరు | కాంగ్రెసు |
| 8. | ,, అంతయ్య | సంగారెడ్డి | ఎస్. సి. ఎఫ్. |
| 9. | ,, పి. ఆంథోనిరెడ్డి | అనంతపురం | కాంగ్రెసు |
| 10. | ,, బొజ్జా అప్పలస్వామి | అమలాపురం (రిజర్వు) | ,, |
| 11. | ,, రాజా మేకా రంగయ్యాప్పారావు బహదూర్ | నూజివీడు | ,, |
| 12. | ,, బీసెట్టి అప్పారావు | అనకాపల్లి | , |
| 13. | ,, కమ్మిలి అప్పారావు | కైకలూరు | ,, |
| 14. | ,, శెట్కార్ అప్పారావు | నారాయణ ఖేడ్ | ,, |
| 15. | ,, వై. ఆదినారాయణరెడ్డి | రాయచోటి | ,, |
| 16. | ,, ఇ. అయ్యపురెడ్డి | నందికొట్కూరు (జనరల్) | ,, |
| 17. | ,, ఆంబటిపూడి బాల నాగేశ్వరరావు | రాజమండ్రి | ,, |
| 18. | ,, ఎం. బాగారెడ్డి | జహీరాబాదు | ,, |
| 19. | ,, బానప్ప | మక్తల్ | స్వతంత్ర |
| 20. | ,, గింజుపల్లి బాపయ్య | పెదకాకాని | కాంగ్రెసు |
| 21. | ,, మండవ బాపయ్య చౌదరి | గురజాల | ,, |
| 22. | ,, పేట బాపయ్య | తిరువూరు | ,, |
| 23. | ,, అల్లూరి బాపినీడు | కొవ్వూరు | ,, |
| 24. | ,, ఇ. బసప్ప | మక్తల్ | ,, |
| 25. | ,, వల్లూరి బసవరాజు | ఆసఫ్‌నగర్ | ,, |
| 26. | ,, పి. బసిరెడ్డి | పులివెందుల | ,, |
| 27. | ,, అనగాని భగవంతరావు | కూచనపూడి | ,, |

| సం. | పేరు | నియోజకవర్గము | పార్టీ |
|---|---|---|---|
| 28. | ,, అంకితం వెంకట భానోజీరావు | విశాఖపట్నం | కాంగ్రెసు |
| 29. | ,, పి. బయ్యపురెడ్డి | నల్లమడ | ,, |
| 30. | ,, కాసు బ్రహ్మానందరెడ్డి | ఫిరంగిపురం | ,, |
| 31. | ,, శీర్ల బ్రహ్మయ్య | ఏలూరు | ,, |
| 32. | ,, జి. బుసన్న | ఆదోని | ,, |
| 33. | ,, జాగర్లమూడి చంద్రమౌళి | అమ్మనబ్రోలు | ,, |
| 34. | ,, కల్లూరి చంద్రమౌళి | వేమూరు | ,, |
| 35. | ,, యడం చన్నయ్య | రేపల్లె | ,, |
| 36. | ,, నలమొత్తు చెంచు రామానాయుడు | కొండపి | ,, |
| 37. | ,, ఎస్. పి. చంగల్రాయ నాయుడు | వేపంజరి | ,, |
| 38. | ,, డా. ఎం. చెన్నారెడ్డి | వికారాబాదు | ,, |
| 39. | ,, చిన్నప్ప | మహబూబ్ నగరం | ఏ. పి. పి. |
| 40. | ,, పి. చిన్నమరెడ్డి | చిత్తూరు | కాంగ్రెసు |
| 41. | ,, ఏ. చిదంబరరెడ్డి | పెనుగొండ | ,, |
| 42. | ,, మరుపిళ్ళ చిట్టి ఉరఫ్ అప్పలస్వామి | విజయవాడ (ఉత్తర) | ,, |
| 43. | ,, జువ్వాది చొక్కారావు | కరీంనగరం | ,, |
| 44. | ,, పొల్సాని చొక్కారావు | ఇందుర్తి | పి. డి. ఎఫ్. |
| 45. | ,, వి. సి. చూడామణిదేవ్ | పార్వతీపురం | ఏ. ఎస్. పి. |
| 46. | ,, మొహమ్మద్ దావర్ హుసేన్ | నిజామాబాదు | కాంగ్రెస్ |
| 47. | ,, ధర్మభిక్షం | నకిరెకల్లు | పి. డి. పి. |
| 48. | ,, ఎం. దొరైకణ్ణు | తిరుత్తని (రిజర్వు) | కాంగ్రెసు |
| 49. | ,, గోపిడి గంగారెడ్డి | మథోల్ | స్వతంత్ర |
| 50. | ,, వాద్రేవు గోపాలకృష్ణ | పిఠాపురం | కాంగ్రెసు |
| 51. | ,, వావిలాల గోపాలకృష్ణయ్య | సత్తెనపల్లి | స్వతంత్ర |
| 52. | ,, పెల్లేటి గోపాలకృష్ణరెడ్డి | గూడూరు | కాంగ్రెసు |
| 53. | ,, టి. గోపాలకృష్ణయ్య గుప్త | మదనపల్లి | ,, |
| 54. | ,, దూరిశెట్టి గోపాలరావు | జగ్గంపేట | ఏ. ఎస్. పి. |
| 55. | ,, బెజవాడ గోపాలరెడ్డి | ఆత్మకూరు | కాంగ్రెసు |
| 56. | ,, పి. గోపాలురెడ్డి | తిరుత్తని (జనరల్) | ,, |
| 57. | ,, జి. గోపాలరెడ్డి | జనగామ | పి. డి. ఎఫ్. |
| 58 | ,, గోపాలరావు ఎక్బోటే | హైకోర్టు | కాంగ్రెసు |
| 59. | ,, నలబోతు గోవిందరాజులు | వినుకొండ | ,, |
| 60. | ,, పోతుల గున్నయ్య | పాతపట్నం (రిజర్వు) | ,, |
| 61. | ,, పర్వత గుర్రాజు | ప్రత్తిపాడు | కాంగ్రెసు |
| 62. | ,, బి. వి. గురుమూర్తి | సికింద్రాబాదు కంటోన్మెంటు | ,, |
| 63. | ,, డి. హన్మంతరావు | జగిత్యాల | ,, |
| 64. | ,, ముళ్ళపూడి హరిశ్చంద్రప్రసాద్ | తణుకు | ,, |

| నం. | పేరు | నియోజకవర్గము | పార్టీ |
|---|---|---|---|
| 65. | ,, టి. హయగ్రీవాచారి | ధర్మసాగరం | కాంగ్రెసు |
| 66. | ,, సిమ్మా జగన్నాథం | నరసన్నపేట | ,, |
| 67. | ,, రెడ్డి జగన్నాథం | చోడవరం | ఎ. ఎస్. పి. |
| 68. | ,, గాదిరాజు జగన్నాథరాజు | ఉండి | కాంగ్రెసు |
| 69. | ,, గొట్టుముక్కల జగన్నాథరాజు | భీమునిపట్నం | సోషలిస్టు |
| 70. | ,, జగన్‌మోహనరెడ్డి | పర్గి | స్వతంత్ర |
| 71. | ,, తెల్లాకుల జాలయ్య | గుంటూరు నెం, 1 | కాంగ్రెసు |
| 72. | ,, కె. జనార్దనరెడ్డి | నాగర్ కర్నూలు | ,, |
| 73. | శ్రీమతి జయలక్ష్మీదేవమ్మ | అలంపురం | ,, |
| 74. | శ్రీ తాళ్ళూరి జియ్యరుదాసు | ఒంగోలు (రిజర్వు) | ,, |
| 75. | ,, అయ్యదేవర కాళేశ్వరరావు | విజయవాడ (దక్షిణ) | కాంగ్రెసు |
| 76. | శ్రీమతి ఆరుట్ల కమలాదేవి | ఆలేరు | పి. డి. ఎఫ్. |
| 77. | శ్రీ రెడ్డి కామయ్య | పల్లిపాలెం (రిజర్వు) | కాంగ్రెసు |
| 78. | శ్రీమతి కాకమాను కనకరత్నమ్మ | నర్సంపేట | ,, |
| 79. | ,, కాశీరామ్ | ఆసిఫాబాదు | ,, |
| 80. | ,, ఎస్. కాశిరెడ్డి | పొదిలి | కమ్యూనిస్టు |
| 81. | ,, బేతి కేశవరెడ్డి | ఘనపురం | కాంగ్రెసు |
| 82. | ,, కటంగూరు కేశవరెడ్డి | పరకాల | ,, |
| 83. | ,, కృష్ణమాచారి | సంగారెడ్డి | స్వతంత్ర |
| 84. | ,, రాజా వత్సవాయి వెంకట కృష్ణంరాజు బహదూర్ | తణుకు | కాంగ్రెసు |
| 85. | శ్రీమత్ కిళాంబివెంకట కృష్ణావతారం | తాడేపల్లిగూడెం | ,, |
| 86. | శ్రీ అల్లం కృష్ణయ్య | వెంకటగిరి (రిజర్వు) | ,, |
| 87. | ,, పుసులూరి కోదండరామయ్య | పోలవరం | ,, |
| 88. | ,, వి. కోదండ రామిరెడ్డి | సర్వేపల్లి | కాంగ్రెసు |
| 89. | ,, దివి కొండయ్యచౌదరి | కందుకూరు | ,, |
| 90. | ,, జలగం కొండలరావు | వెంసూరు | ,, |
| 91. | ,, ప్రగడ కోటయ్య | చీరాల | ,, |
| 92. | ,, కడప కోటిరెడ్డి | లక్కిరెడ్డిపల్లి | ,, |
| 93. | ,, మేకా కోటిరెడ్డి | మంగళగిరి | ,, |
| 94. | ,, వేముల కూర్మయ్య | గుడివాడ (రిజర్వు) | ,, |
| 95. | శ్రీమతి కుసుం గజపతిరాజు | గజపతినగరం (జనరల్) | సోషలిస్టు |
| 96. | శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ | చినకొండూరు | కాంగ్రెసు |
| 97. | ,, జవ్వాది లక్ష్మయ్య | పెనుగొండ | ,, |
| 98. | ,, ఎల్. లక్ష్మణదాసు | పాతపట్నం (జనరల్) | ,, |
| 99. | ,, రొక్కం లక్ష్మీనరసింహందొర | టెక్కలి | ,, |
| 100. | ,, తేతలి లక్ష్మీనారాయణరెడ్డి | అనపర్తి | ,, |
| 101. | శ్రీ అడ్డాకుల లక్ష్మీనాయుడు | నాగూరు | ఏ. ఎస్. పి. |

| సం. | పేరు | నియోజకవర్గము | పార్టీ |
|---|---|---|---|
| 102. | ,, గౌతు లచ్చన్న | సోంపేట | కాంగ్రెసు |
| 103. | ,, రూతల లచ్చపాత్రుడు | గోలుగొండ | ఏ. ఎన్. పి. |
| 104. | ,, ఎం. లక్ష్మయ్య | దేవరకొండ (రిజర్వు) | కాంగ్రెసు |
| 105. | ,, జి. లక్ష్మారెడ్డి | మైదారం | పి. డి. ఎఫ్. |
| 106. | శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ | ఖమ్మం | కాంగ్రెసు |
| 107. | శ్రీ ఎం. ఎస్. లక్ష్మీనరసయ్య | ఇబ్రాహింపట్నం | ,, |
| 108. | ,, ఎన్. కె. లింగం | నందికొట్కూరు (రిజర్వు) | ,, |
| 109. | ,, మాధవరావు | జూకల్ | స్వతంత్ర |
| 110. | ,, మహబూబలీఖాన్ | కర్నూలు | కాంగ్రెసు |
| 111. | ,, షేక్ మహమ్మద్ రహమతుల్లా | కడప | ,, |
| 112. | ,, మొహ్మద్ తహశీల్ | భద్రాచలం (జనరల్) | కమ్యూనిస్టు |
| 113. | శ్రీ పి. మహేంద్రనాథ్ | నాగర్ కర్నూలు | కాంగ్రెసు |
| 114. | ,, ఉప్పల మల్సూరు | సూర్యాపేట | పి. డి. ఎఫ్. |
| 115. | ,, మందా శాయిలు | పరకాల | కాంగ్రెసు |
| 116. | ,, బసవ మాణయ్య | ఆందోల్ | స్వతంత్ర |
| 117. | శ్రీమతి మాసుమాబేగం | పత్తర్‌గట్టి | కాంగ్రెసు |
| 118. | శ్రీ మాచరసు మత్స్యరాజు | గూడెం | ఏ. యస్. పి. |
| 119. | ,, మీర్ అహమ్మద్ అలీఖాన్ | మలక్‌పేట | కాంగ్రెసు |
| 120. | ,, మీర్జా షుకూర్‌బేగ్ | వరంగలు | ,, |
| 121. | ,, మోహనరెడ్డి | బుగ్గారం | స్వతంత్ర |
| 122. | ,, మురళీధరరెడ్డి | ఆత్మకూరు | కాంగ్రెసు |
| 123. | ,, మెర్లపాక మునుస్వామి | గూడూరు (రిజర్వు) | ,, |
| 124. | ,, సి. హెచ్. ఎస్. ఆర్. వి. పి. మూర్తిరాజు | పెంటపాడు | ,, |
| 125. | ,, ముత్యం రెడ్డి | నిర్మల్ | స్వతంత్ర |
| 126. | ,, జె. బి. ముత్యాలరావు | గజ్వేల్ (రిజర్వు) | కాంగ్రెసు |
| 127. | ,, డా. నాగన్న | కల్వకుర్తి | ,, |
| 128. | ,, ఏటి నాగయ్య | పరవాడ | ,, |
| 129. | ,, గంజి నాగేశ్వరరావు | రాజోలు | కమ్యూనిస్టు |
| 130. | ,, మేడూరి నాగేశ్వరరావు | గుంటూరు నెం. 2 | కాంగ్రెసు |
| 131. | ,, మందపాటి నాగిరెడ్డి | మాచర్ల | కమ్యూనిస్టు |
| 132. | ,, దొడ్డా నర్సయ్య | యిల్లెందు | కాంగ్రెసు |
| 133. | ,, కారళ్ళ నర్సయ్య | సిరిసిల్ల | పి. డి. ఎఫ్. |
| 134. | ,, పొల్సాని నరసింగరావు | హుజూరాబాదు | స్వతంత్ర |
| 135. | ,, భీమిరెడ్డి నరసింహారెడ్డి | సూర్యాపేట (జనరల్) | పి. డి. ఎఫ్. |
| 136. | ,, రెడ్డిగారి నరసింహారెడ్డి | గజ్వేల్ (జనరల్) | కాంగ్రెసు |
| 137. | ,, గడ్డంపల్లి నారాయణరెడ్డి | దేవరకొండ (జనరల్) | ,, |
| 138. | ,, జి. నారాయణరెడ్డి | ఆసిఫాబాదు | ,, |

| సం. | పేరు | నియోజకవర్గము | పార్టీ |
|---|---|---|---|
| 139. | ,, రావి నారాయణరెడ్డి | భువనగిరి | పి. డి. ఎఫ్. |
| 140. | ,, దొడ్డా నరసయ్య | హుజూర్‌నగరం | ,, |
| 141. | ,, గొల్కోట నరసింహమూర్తి | అమలాపురం (జనరల్) | ఏ. ఎస్. పి. |
| 142. | ,, పైడి నరసింహఅప్పారావు | పాలకొండ | ,, |
| 143. | ,, కె. ఎల్. నరసింహారావు | ఇల్లెందు | పి. డి. ఎఫ్. |
| 144. | ,, బి. జి. ఎం. ఏ. నరసింగరావు | కణితి | కాంగ్రెసు |
| 145. | ,, జె. వి. నరసింగరావు | బేగంబజారు | ,, |
| 146. | ,, మందుముల నరసింగరావు | కొల్లాపురం | ,, |
| 147. | ,, సందా నారాయణప్ప | గుత్తి (జనరల్) | ,, |
| 148. | ,, రెడ్డివారి నాదమునిరెడ్డి | తిరుపతి | ,, |
| 149. | ,, నవాబ్ మెహదీ నవాజ్‌జంగ్ | జూబిలీహిల్స్ | ,, |
| 150. | ,, కందుల ఓబులరెడ్డి | మార్కాపురం | ,, |
| 151. | ,, కె. వి. యస్. పద్మనాభరాజు | రేవిడి | సోషలిస్టు |
| 152. | ,, పద్మనాభరెడ్డి | వనపర్తి | కాంగ్రెసు |
| 153. | ,, ముళ్ళపూడి పళ్ళంరాజు | కాకినాడ | ,, |
| 154. | ,, పిన్నెంటి పమిడేశ్వరరావు | మల్లేశ్వరం | ,, |
| 155. | ,, తమ్మినేని పాపారావు | నగరికటకం | ఏ. ఎస్. పి. |
| 156. | ,, గోవాడ పరంధామయ్య | పొన్నూరు | కాంగ్రెసు |
| 157. | ,, పి. పార్థసారధి | రాజంపేట (జనరల్) | ,, |
| 158. | ,, ఎస్. బి. పి. పట్టాభిరామారావు | పామర్రు | కాంగ్రెసు |
| 159. | ,, నామవరపు పెద్దన్న (పెదపేరయ్య) | ఖమ్మం | పి. డి. ఎఫ్. |
| 160. | ,, దాసరి పెరుమాళ్లు | పాలకొల్లు (రిజర్వు) | కాంగ్రెసు |
| 161. | ,, జి. వి. పీతాంబరరావు | లక్సెట్టిపేట | కాంగ్రెసు |
| 162. | ,, ముత్యాల పోతరాజు | నర్సాపట్నం (రిజర్వు) | ,, |
| 163. | ,, టంగుటూరి ప్రకాశం | ఒంగోలు (జనరల్) | ,, |
| 164. | ,, కొత్తపల్లి పున్నయ్య | చీపురుపల్లి (రిజర్వు) | ,, |
| 165. | ,, మజ్జా పైడయ్య నాయుడు | కొండకర్ల | ,, |
| 166. | ,, ముదిగొండ సిద్ధవీరరాజలింగం | చిల్లంచర్ల | ,, |
| 167. | ,, పి. రాజగోపాలనాయుడు | తవనంపల్లి | ,, |
| 168. | ,, బి. రాజారాం | సుల్తానాబాదు | ,, |
| 169. | ,, ఎం. రాజారామ్ | గుత్తి (రిజర్వు) | ,, |
| 170. | ,, రాజా వై. బి. వీర బసవ చిక్కరాయలు | పుంగనూరు (జనరల్) | ఏ. యస్. పి. |
| 171. | ,, బోయిన రాజయ్య | సాలూరు (రిజర్వు) | కాంగ్రెసు |
| 172. | ,, చెన్నమనేని రాజేశ్వరరావు | చొప్పదండి | పి. డి. ఎఫ్. |
| 173. | శ్రీ ముళ్ళపూడి రాజేశ్వరరావు | దివి (రిజర్వు) | కాంగ్రెసు |
| 174. | ,, పి. వి. రాజేశ్వరరావు | సిద్దిపేట | ,, |
| 175. | ,, ఎస్. రాజేశ్వరరావు | ములుగు | పి. డి. ఎఫ్. |
| 176. | ,, కోదాటి రాజమల్లు | సిర్పూర్ (జనరల్) | పి. ఎస్. పి. |

| సం. | పేరు | నియోజకవర్గము | పార్టీ |
|---|---|---|---|
| 177. | ,, నడింపల్లి రామభద్రరాజు | చెయ్యేరు | కాంగ్రెసు |
| 178. | ,, డి. రామబ్రహ్మం | కుప్పం | ,, |
| 179. | ,, రామచంద్రరావు | సుల్తానాబాదు | ,, |
| 180. | ,, రాజా కాకర్లపూడి రామచంద్రరాజు బహదూర్ | రామచంద్రాపురం | ,, |
| 181. | ,, తరిమెల రామచంద్రారెడ్డి | పుట్లూరు | ,, |
| 182. | ,, పప్పూరి రామాచార్యులు | ధర్మవరం (జనరల్) | ,, |
| 183. | ,, కట్టుకూరు రామచంద్రారెడ్డి | రామన్నపేట | పి. డి. ఎఫ్. |
| 184. | ,, నూకల రామచంద్రారెడ్డి | డోర్నకల్లు | కాంగ్రెసు |
| 185. | శ్రీ కుందా రామయ్యా | జమ్మలమడుగు | కాంగ్రెసు |
| 186. | ,, కొల్లా రామయ్యా | పరుచూరు | ,, |
| 187. | ,, అర్. బి. రామకృష్ణరాజు | వడమాలపేట | ఏ. ఎన్. పి. |
| 188. | ,, బత్తెన రామకృష్ణారెడ్డి | కావలి | ఏ. పి. పి. |
| 189. | ,, జాగర్లమూడి రామకోటయ్యా | కందిపాడు | కాంగ్రెసు |
| 190. | ,, గోకా రామలింగం | జనగామ | ,, |
| 191. | ,, హెచ్. రామలింగారెడ్డి | ఆలూరు | ,, |
| 192. | ,, వి. రామారావు | షాబాద్ (రిజర్వు) | ,, |
| 193. | ,, బొమ్మ రామారెడ్డి | మైదుకూరు | ఏ. ఎన్. పి. |
| 194. | ,, గణపా రామస్వామిరెడ్డి | పెదకూరపాడు | కాంగ్రెసు |
| 195. | ,, అరిగె రామస్వామి | వికారాబాదు (రిజర్వు) | ,, |
| 196. | ,, పెద్దింటి రామస్వామి నాయుడు | బలిజెపేట | ,, |
| 197. | ,, మాగంటి రామయ్యా | కంచికచర్ల | ,, |
| 198. | ,, రామిరెడ్డి చంద్రా ఓబులరెడ్డి | ప్రొద్దుటూరు | స్వతంత్ర |
| 199. | ,, గోపవరం రామిరెడ్డి | నంద్యాల | ఏ. ఎన్. పి. |
| 200. | ,, జి. రాములు | హుజూరాబాదు | స్వతంత్ర |
| 201. | ,, నిచ్చర్లరాములు | బ్రాహ్మణతర్ల | కాంగ్రెసు |
| 202. | ,, గుజ్జల రామునాయుడు | శృంగవరపు కోట | సోషలిస్టు |
| 203. | ,, ఉప్పాడ రంగబాబు | ఇచ్ఛాపురం | కాంగ్రెసు |
| 204. | ,, ఎస్. రంగనాథ మొదలియార్ | రామకృష్ణరాజుపేట | ఏ. ఎన్. పి. |
| 205. | ,, రంగనాథరావు | ఆదిలాబాదు | పి. డి. ఎఫ్. |
| 206. | ,, రంగారెడ్డి | బొల్కొండ | కాంగ్రెసు |
| 207. | ,, పిడతల రంగారెడ్డి | గిద్దలూరు | ,, |
| 208. | ,, మూల్పూరు రంగయ్యా | దెందులూరు | ,, |
| 209. | ,, ఏ. రత్నం | పుంగనూరు (రిజర్వు) | ,, |
| 210. | ,, బండారు రత్నసభాపతి | బద్వేల్ | సోషలిస్టు |
| 211. | శ్రీమతి బి. రుక్మిణీదేవి | హిందూపురం (రిజర్వు) | కాంగ్రెసు |
| 212. | శ్రీమతి టి. ఎన్. సదాలక్ష్మి | కామారెడ్డి | ,, |
| 213. | శ్రీ నర్రెడ్డి సాంబురెడ్డి | కమలాపురం | ,, |

| సం. | పేరు | నియోజకవర్గము | పార్టీ |
|---|---|---|---|
| 214. | ,, నీలం సంజీవరెడ్డి | కాళహస్తి (జనరల్) | కాంగ్రెసు |
| 215. | ,, దామోదరం సంజీవయ్య | ఎమ్మిగనూరు (రిజర్వు) | ,, |
| 216. | ,, బసవారెడ్డి శంకరయ్య | బుచ్చిరెడ్డిపాలెం (జనరల్) | కమ్యూనిస్టు |
| 217. | శ్రీమతి శాంతాబాయి | కల్వకుర్తి | కాంగ్రెసు |
| 218. | శ్రీ కె. శాంతప్ప | ధర్మవరం (రిజర్వు) | ,, |
| 219. | ,, కె. సత్యనారాయణ | సికింద్రాబాదు (సిటీ) | ,, |
| 220. | ,, పుత్సల సత్యనారాయణ | సామర్లకోట | కమ్యూనిస్టు |
| 221. | ,, చౌదరి సత్యనారాయణ | షేర్‌మొహమ్మద్‌పురం | కాంగ్రెసు |
| 222. | ,, అద్దేపల్లి సత్యనారాయణమూర్తి | పాలకొల్లు | ,, |
| 223. | ,, ముదుండి సత్యనారాయణరాజు | చీపురుపల్లి (జనరల్) | సోషలిస్టు |
| 224. | ,, బొమ్మకంటి సత్యనారాయణరావు | మధిర | కాంగ్రెసు |
| 225. | ,, డి. కె. సత్యారెడ్డి | గద్వాల | స్వతంత్ర |
| 226. | శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారి | బాన్స్‌వాడ | కాంగ్రెసు |
| 127. | శ్రీ కోటగిరి సీతారామస్వామి | బొబ్బిలి | ,, |
| 228. | ,, కొత్తూరి సీతయ్యగుప్త | ముషీరాబాదు | ,, |
| 229. | ,, ఎన్. సి. శేషాద్రి | రాయదుర్గం | ,, |
| 230. | ,, బి. పి. శేషారెడ్డి | డోన్ | ఏ. ఎన్. పి. |
| 231. | షహాబుద్దీన్ అహ్మద్‌ఖాన్ | యాకూత్‌పురా | కాంగ్రెసు |
| 232. | శ్రీమతి షాహజహా బేగం | షాద్‌నగరం | ,, |
| 233. | శ్రీ షేక్ మౌలాసాహెబ్ | ఉదయగిరి | ,, |
| 234. | ,, పత్ర శింగరయ్య | కాళహస్తి (రిజర్వు) | ,, |
| 235. | ,, మహంతు రాజాయార్లగడ్డ శివరామ ప్రసాద్ బహద్దర్ | దివి (జనరల్) | ,, |
| 236. | ,, శ్రీనివాసరావు | బోధన్ | స్వతంత్ర |
| 237. | ,, దొండా శ్రీరామమూర్తి | మాడుగుల | సోషలిస్టు |
| 238. | ,, పుతుంబాక శ్రీరాములు | దుగ్గిరాల | కాంగ్రెసు |
| 239. | ,, నంబూరి శ్రీనివాసరావు | తాడేపల్లిగూడెం (రిజర్వు) | ,, |
| 240. | ,, చెలికాని శ్రీరంగనాయకులు | పునుకూరు | ,, |
| 241. | ,, బత్తిని సుబ్బారావు | బూరుగుపూడి (రిజర్వు) | ,, |
| 242. | ,, కల్లూరి సుబ్బారావు | హిందూపురం (జనరల్) | ,, |
| 243. | ,, చల్లా సుబ్బారాయుడు | తాడిపత్రి | ,, |
| 244. | ,, ఏ. సి. సుబ్బారెడ్డి | నెల్లూరు | ,, |
| 245. | ,, బి. వి. సుబ్బారెడ్డి | కోయిలకుంట్ల | ఏ. ఎన్. పి. |
| 246. | ,, కె. సుదర్శనరావు | పాల్వంచ | కాంగ్రెసు |
| 247. | శ్రీమతి సుమిత్రాదేవి | జూబిలీ హిల్స్ (రిజర్వు) | ,, |
| 248. | శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య | గన్నవరం | కమ్యూనిస్టు |
| 249. | ,, గంట్లాన సూర్యనారాయణ | గజపతి నగరం (రిజర్వు) | సోషలిస్టు |
| 250. | ,, పి. సూర్యనారాయణ | శ్రీకాకుళం | ఏ. ఎన్. పి. |

| నం. | పేరు | నియోజకవర్గము | పార్టీ |
|---|---|---|---|
| 251. | రాజా సాగి సూర్యనారాయణరాజు | నర్సీపట్నం (జనరల్) | కాంగ్రెసు |
| 252. | శ్రీ టి. జి. తిమ్మయ్యసెట్టి | కోసిగి | ,, |
| 253. | ,, సి. పి. తిమ్మారెడ్డి | సిర్వేలు | ,, |
| 254. | ,, పి. తిమ్మారెడ్డి | వాయలపాడు | ,, |
| 255. | ,, ఆర్. తిరుపతిరావు | పల్లిపాలెం (జనరల్) | ,, |
| 256. | శ్రీమతి పిత్తల వాణీ రమణరావు | భద్రాచలం (రిజర్వు) | ,, |
| 257. | శ్రీ వాసుదేవ్ కృష్ణాజీ నాయక్ | సుల్తాన్‌బజార్ | ,, |
| 258. | ,, టి. వీరరాఘవులు | కొవ్వూరు (రిజర్వు) | ,, |
| 259. | ,, గుండం వీరయ్య | నర్సాపూర్ | ,, |
| 260. | ,, కే. వి. వేమారెడ్డి | కదిరి | ,, |
| 261. | ,, స్వర్ణ వేమయ్య | బుచ్చిరెడ్డిపాలెం (రిజర్వు) | కమ్యూనిస్టు |
| 262. | ,, నాగినేని వెంకయ్య | అద్దంకి | కాంగ్రెసు |
| 263. | ,, మంతెన వెంకట్రాజు | బాపట్ల | ,, |
| 264. | ,, కళా వెంకట్రావు | కొత్తపేట | ,, |
| 265. | ,, వెంకటస్వామి | సిర్పూరు (రిజర్వు) | ,, |
| 266. | ,, నక్కా వెంకటయ్య | ఎఱ్ఱగొండి పాలెం | ,, |
| 267. | ,, శాకమూరి వెంకట కృష్ణప్రసాదరావు | చెన్నూరు | పి. డి. ఎఫ్. |
| 268. | ,, పాములపర్తి వెంకట నరసింహారావు | మంథని | కాంగ్రెసు |
| 269. | ,, అల్లూరి వెంకట్రామరాజు | రాజోలు (జనరల్) | కమ్యూనిస్టు |
| 270. | ,, దిరిశాల వెంకట రమణారెడి | దర్శి | కాంగ్రెసు |
| 271. | ,, కొల్లిపర వెంకటరమణయ్య | బందరు | ,, |
| 272. | ,, కొండా వెంకట రంగారెడ్డి | షాబాద్ (జనరల్) | ,, |
| 273. | ,, కాకాని వెంకటరత్నం | వుయ్యూరు | కాంగ్రెసు |
| 274. | శ్రీమతి యన్. వెంకట రత్నమ్మ | బూరుగుపూడి (జనరల్) | ,, |
| 275. | శ్రీ వెంకట రెడ్డి | నల్లగొండ | పి. డి. ఎఫ్. |
| 276. | ,, నాచు వెంకటరామయ్య | భీమవరం | కాంగ్రెసు |
| 277. | ,, నల్లపాటి వెంకట్రామయ్య | నర్సారావుపేట | ,, |
| 278. | ,, ఆలపాటి వెంకట్రామయ్య | తెనాలి | ,, |
| 279. | ,, ఎన్. వెంకట్రామా నాయుడు | పీలేరు | ,, |
| 280. | ,, గ్రంధి వెంకటరెడ్డి నాయుడు | నర్సాపురం | ,, |
| 281. | ,, కాసిం వెంకటరెడ్డి | నందిపాడు | ఏ. ఎన్. పి. |
| 282. | ,, పూల వెంకట రమణప్ప | గోరంట్ల | కాంగ్రెసు |
| 283. | ,, బండ్లమూడి వెంకట శివయ్య | మార్టేరు | ,, |
| 284. | ,, చాగంటి వెంకట సోమయాజులు | శృంగవరపుకోట | సోషలిస్టు |
| 285. | ,, దూర్వాసుల వెంకట సుబ్బారావు | పెద్దాపురం | కమ్యూనిస్టు |
| 286. | ,, టి. ఏన్. వెంకట సుబ్బారెడ్డి | తంబళ్లపల్లె | కాంగ్రెసు |
| 287. | ,, పాల వెంకట సుబ్బయ్య | రాజంపేట (రిజర్వు) | ,, |
| 288. | ,, అట్లుమల్లి వెంకట సుబ్రహ్మణ్యం | గుడివాడ (జనరల్) | స్వతంత్ర |

| నం. | పేరు | నియోజకవర్గము | పార్టీ |
|---|---|---|---|
| 289. | ,, చింతలపాటి వెంకట సూర్య నారాయణరాజు ఉరఫ్ సన్యాసిరాజు | యలమంచిలి | ఏ. ఎన్. పి. |
| 290. | ,, పొదిలేటి వెంకటస్వామిరెడ్డి | వెంకటగిరి (జనరల్) | కాంగ్రెసు |
| 291. | ,, వెంకటేశ్వరరావు | మెదక్ | ,, |
| 292. | ,, పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు | నందిగామ | కమ్యూనిస్టు |
| 293. | ,, యఱ్ఱబల్లి వెంకట్రామనర్సయ్య | వరదన్నపేట | కాంగ్రెసు |
| 294. | ,, వెంకట్రామారెడ్డి | కామారెడ్డి | ,, |
| 295. | ,, సి. వెంకటరెడ్డి | మిర్యాలగూడెం | పి. డి. ఎఫ్. |
| 296. | ,, కె. విజయ భాస్కరరెడ్డి | ఎమ్మిగనూరు (జనరల్) | కాంగ్రెసు |
| 297. | ,, వెల్లంకి విశ్వేశ్వరరావు | మైలవరం | కమ్యూనిస్టు |
| 298. | ,, జి. ఎల్లమందారెడ్డి | కనిగిరి | ,, |
| 299. | ,, అల్లు ఎఱుకునాయుడు | సాలూరు (జనరల్) | సోషలిస్టు |
| 300. | ,, ఖాళీ | పత్తికొండ | |
| 301. | ,, ఖాళీ | విజయనగరం | |

*గమనిక :*

ఏ. ఎన్. పి. ఆంధ్ర నేషనలిస్టుపార్టీ ; పి. ఎస్. పి. ప్రజా సోషలిస్టు పార్టీ ;
ఎస్. సి. ఎఫ్. షెడ్యూల్డ్ కాస్ట్స్ ఫెడరేషన్ ; ఏ. పి. పి. ఆంధ్ర ప్రజాపార్టీ ;
పి. డి. యఫ్. పీపుల్స్ డెమోక్రటిక్ ఫ్రంట్.

---

# లోకసభ సభ్యులు

| నం. | పేరు | నియోజకవర్గము | పార్టీ |
|---|---|---|---|
| 1. | శ్రీ బొడ్డేపల్లి రాజగోపాలరావు | శ్రీకాకుళం | కాంగ్రెసు |
| 2. | ,, బిడ్డిక సత్యనారాయణ | పార్వతీపురం (జనరల్) | ,, |
| 3. | ,, దిప్పల సూరిదొర | పార్వతీపురం (రిజర్వు) | స్వతంత్ర |
| 4. | ,, పూసపాటి విజయరామ గజపతిరాజు | విశాఖ పట్నం | ,, |
| 5. | ,, కంకిపాటి వీరన్న పడాల్ | గోలుగొండ (రిజర్వు) | కాంగ్రెసు |
| 6. | ,, మిస్సుల సూర్యనారాయణమూర్తి | గోలుగొండ (జనరల్) | ,, |
| 7. | ,, దొత్త సత్యనారాయణరాజు | రాజమండ్రి | ,, |
| 8. | ,, మొసలికంటి తిరుమలరావు | కాకినాడ (జనరల్) | ,, |
| 9. | ,, బి. ఎస్. మూర్తి | కాకినాడ (రిజర్వు) | ,, |
| 10. | ,, ఉద్దరాజు రామం | నర్సాపురం | కమ్యూనిస్టు |
| 11. | కుమారి మోతే వేదకుమారి | ఏలూరు | కాంగ్రెసు |
| 12. | శ్రీ దుగ్గిరాల బలరామ కృష్ణయ్య | గుడివాడ | ,, |

| సం. | పేరు | నియోజకవర్గము | పార్టీ |
|---|---|---|---|
| 13. | కుమారి కొమర్రాజు అచ్చమాంబ | విజయవాడ | కాంగ్రెసు |
| 14. | శ్రీ మండలి వెంకటకృష్ణారావు | మచిలీపట్నం | ,, |
| 15. | ,, గోగినేని రంగనాయకులు ఉరఫ్ ఎన్. జి. రంగా | తెనాలి | ,, |
| 16. | ,, కొత్త రఘురామయ్య | గుంటూరు | ,, |
| 17. | ,, రొండా నారపరెడ్డి | ఒంగోలు | ,, |
| 18. | ,, చేగిరెడ్డి బాలిరెడ్డి | మార్కాపురం | ,, |
| 19. | ,, రేబాల లక్ష్మీనరసారెడ్డి | నెల్లూరు (జనరల్) | ,, |
| 20. | ,, అంజనప్ప | నెల్లూరు (రిజర్వు) | ,, |
| 21. | ,, ఎం. అనంతశయనం అయ్యంగార్ | చిత్తూరు (జనరల్) | ,, |
| 22. | ,, ఎం. వి, గంగాధరశివ | చిత్తూరు (రిజర్వు) | ,, |
| 23. | ,, టి. ఎన్. విశ్వనాథరెడ్డి | రాజంపేట | ,, |
| 24. | ,, వి. రామిరెడ్డి | కడప | ,, |
| 25. | ,, టి. నాగిరెడ్డి | అనంతపురం | కమ్యూనిస్టు |
| 26. | ,, కె. వి. రామకృష్ణారెడ్డి | హిందూపురం | కాంగ్రెసు |
| 27. | ,, పెండేకంటి వెంకటసుబ్బయ్య | ఆదోని | ,, |
| 28. | ,, ఉస్మాన్ అలీఖాన్ | కర్నూలు | ,, |
| 29. | ,, జె. రామేశ్వరరావు | మహబూబ్ నగరం (జనరల్) | ,, |
| 30. | ,, శ్రీ పులి రామస్వామి | మహబూబ్ నగరం (రిజర్వు) | ,, |
| 31. | ,, వినాయకరావు | హైద్రాబాదు | ,, |
| 32. | ,, అహ్మద్ మొహియొద్దీన్ | సికింద్రాబాదు | ,, |
| 33. | శ్రీమతి సంగెం లక్ష్మీబాయి | వికారాబాదు | ,, |
| 34, | శ్రీ పి. హనుమంతరావు | మెదక్ | ,, |
| 35. | ,, హరిశ్చంద్ర హెడా | నిజామాబాదు | ,, |
| 36. | ,, కె. ఆశన్న | ఆదిలాబాదు | ,, |
| 37. | ,, శ్రీరంగారావు | కరీం నగరం (జనరల్) | ,, |
| 38. | ,, యం. ఆర్. కృష్ణ | కరీం నగరం (రిజర్వు) | ,, |
| 39. | ,, సాదతలీఖాన్ | వరంగలు | ,, |
| 40. | ,, ఇటికాల మధుసూదనరావు | మహబూబాబాద్ | ,, |
| 41. | ,, వితల్‌రావు | ఖమ్మం | పి. డి. ఎఫ్. |
| 42. | ,, దేవులపల్లి వెంకటేశ్వరరావు | నల్గొండ (జనరల్) | ,, |
| 43. | ,, దేవరంగపల్లి రాజయ్య | నల్గొండ (రిజర్వు) | కాంగ్రెసు |



# * డైరీ *

## మార్చి, 1957

24. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కారణంగా, అప్రూవల్‌స్సర్టిఫికెట్ల చెల్లుబడికి, వాటిని యివ్వడానికి సంబంధించిన పరిస్థితిని ప్రభుత్వం స్పష్టపరిచింది. 1956 చివరి మూడు నెలల్లోను వెనుకటి ఆంధ్ర, హైదరాబాదు ప్రభుత్వాలచే యివ్వబడిన అప్రూవల్ సర్టిఫికెట్లు, కొత్తవి, రిన్యూచేయబడినవికూడా 31-12-57 వరకూ చెల్లుతాయి.

25. కరువుభత్యంలో హెచ్చించబడిన రూ. 6, జీత భత్యాలు రేండూ కలసి రూ. 100 కి మించకుండా వుండే ప్రభుత్వోద్యోగు లందరికీ యివ్వబడతాయని శాసనసభలో ఆర్థికమంత్రి ప్రకటించారు. ఇందువల్ల జీతం, కరువుభత్యం కలిపి రూ. 100 అందుకునే వారికికూడా యిప్పుడు హెచ్చించబడిన రూ. 6 లభిస్తాయి.

26. రాష్ట్ర శాసనసభ 1957-58 మొదటి నాలుగునెలలకి రూ. 34 కోట్లు మొత్తం గల ఇంటరిమ్ బడ్జెట్‌ని ఆమోదించింది.

హైద్రాబాదు నూలు మిల్లులను కొనడానికై తెలంగాణా చేనేతపనివారి సహకార సంఘానికి ప్రభుత్వం రూ. 3 లక్షల అప్పును మంజూరు చేసింది. చేనేత రంగంలో తలపెట్టబడిన పెద్దపనులలో యీ రాష్ట్రంలో యిది రెండవది, మొదటిది గుంతకల్లులోని సహకార నూలుమిల్లు.

27. ఆంధ్రప్రదేశ్‌లో పబ్లిక్‌రంగంలో రసాయన యెరువుల తయారీ ఫ్యాక్టరీని నెలకొల్పాలన్న ప్రతిపాదన యికముందు యెప్పుడయినా వచ్చినట్లయితే, ఆ విషయాన్ని తాను పరిశీలించగలనని కేంద్రప్రభుత్వం వాగ్దానం చేసింది. రాష్ట్ర శాసనసభలో పరిశ్రమలమంత్రి తరపున జవాబు చెప్పిన స్థానిక పరిపాలనమంత్రి యీసమాచారాన్ని తెలియజేశారు.

28. ప్రభుత్వానికి సంబంధంగల పరిశ్రమలను యేకస్థాయికి కొనిరావడానికి తీసుకొనవలసిన చర్యలను గురించి ప్రభుత్వం సూక్ష్మంగా పరిశీలిస్తున్నదని రాష్ట్రశాసనసభలో ముఖ్యమంత్రి వాక్రుచ్చారు. ఆయన హైద్రాబాదు పారిశ్రామిక ఫండు (ఆంధ్రప్రదేశ్ సవరణ) బిల్లును ప్రతిపాదిస్తున్నారు. ఈ సందర్భంలో యిది తొలిచర్య అని ఆయన అన్నారు.

1957-58 కి ప్రణాళికను తయారుచేసేటప్పుడు యితర విషయాలతోపాటు ఆధికాహారోత్పత్తి పథకాలకి మిక్కిలి ప్రాధాన్యత యివ్వాలని ప్లానింగు కమీషన్ రాష్ట్ర ప్రభుత్వాలకి సూచించింది. ప్లానింగు కమిషన్ సూచనలను ముఖ్యమంత్రి శాసనసభలో ప్రశ్నోత్తరాల సమయంలో సభవారికి అందచేశారు.

29. కేంద్రప్రభుత్వం యొక్క చిన్నయెత్తు పరిశ్రమల బోర్డు ఆమోదించిన పద్ధతిలో 4 పారిశ్రామిక యేస్టేట్లను నెలకొల్పాలని ప్రభుత్వం సంకల్పించింది, ఇవి విశాఖపట్నం, విజయవాడ, హైదరాబాదు, సామర్లకోటలలో నెలకొల్ప బడతాయి. ఒక్కొక్క యెస్టేటు ఖర్చు దగ్గరగా రూ 30-35 లక్షలు వుంటుందని రాష్ట్ర శాసనసభలో యీ సమాచారాన్ని తెలియచేసిన స్థానిక పరిపాలన మంత్రి చెప్పారు. సామర్లకోటలో యెస్టేటు చిన్నది. కావడంవల్ల దాని ఖర్చు రూ 5 లక్షల లోపున వుంటుందని కూడా ఆయన చెప్పారు.

ఏకీకృతమైన అమ్మకం పన్నుబిల్లు శాసనసభలో వచ్చే సమావేశంలో ప్రవేశ పెట్టబడ గలదని ఆర్థిక మంత్రి చెప్పారు.

30. 1-4-1957 నుంచి నయాపైసాలు ప్రవేశ పెట్టబడిన కారణంగా, ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా బస్సులలో ప్రయాణించే ప్రయాణీకులు టిక్కట్టు డబ్బును, పావలాకి తక్కువ అయిన సందర్భాలలో యేదో ఒకరకం నాణెములలో కాని లేక నయాపైసాలలోకాని చెల్లించాలని రాష్ట్ర ప్రభుత్వం విడుదల చేసిన నోటిఫికేషన్ ఒకటి తెలుపుతున్నది.

31. సాంఘిక, ఆర్థిక పరిస్థితులను అభివృద్ధి చేయడానికి ధనికులు నిస్స్వార్థమైన దృక్పథాన్ని అలవరచు కోవాలని తెలుగు సంవత్సరాది ప్రత్యేక సందేశంలో ముఖ్య మంత్రి ఉద్బోధించారు.

## ఏప్రిల్, 1957

1. దశాంశ నాణెముల పద్ధతి అమలులోనికి వచ్చింది. ప్రశాంతమైన విప్లవం అని ప్రధాన మంత్రి వాక్రుచ్చారు.

భూమిని సెస్టు చేసే లేబొరేటరీలు రెండు పని ప్రారంభించాయి. ఇవి భూమిని వేగంగా సెస్టు చేయడానికి వుద్దేశించ బడ్డాయి. మొదటిది : హైదరాబాదు నగరం వెలుపల

రాజేంద్రనగర్ ప్రధాన క్షేత్రంలో వుంది. ఇది తెలంగాణా ప్రాంతం అవసరాలను తీరుస్తుంది. రెండవది: బాపట్ల వ్యవ సాయ కళాశాలలో నెలకొల్ప బడింది. ఇది ఆంధ్ర రాష్ట్రం లోని 11 జిల్లాలకి వుపయోగ పడుతుంది.

2. ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో విడివిడిగా పని చేస్తున్న కేంద్రభూమి తనఖా బ్యాంకులను యేకం చేసి ఒకేఒక బ్యాంకింగు సంస్థగా రూపొందించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ సందర్భంలో అవసరమైన బిల్లు రాష్ట్రి శాసనసభలో వచ్చే సమావేశంలో ప్రవేశపెట్టబడుతుంది.

3. రాష్ట్రిషెడ్యూల్డు జాతుల సహకార ఆర్థిక కార్పొ రేషన్‌కి రూ. 5 లక్షలు అప్పు యిమ్మని రాష్ట్రిప్రభుత్వం విజయవాడలోని ఆంధ్రాస్టేట్ సహకార బ్యాంకుని అడిగినట్లు సహకార మంత్రి తెలియజేశారు.

4. తూర్పు గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలు మూడింటిలోనూ కూడా న్యాయశాఖను కార్యనిర్వాహక శాఖనుంచి త్వరితంగా వేరుపరచమని ప్రధాన న్యాయ మూర్తి రాష్ట్రిప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

5. ద్వితీయ ప్రణాళిక కాలంలో రాష్ట్రింలోని భారీ సాగునీటి ప్రాజెక్టుల పరిశోధనకై కేంద్రప్రభుత్వం రూ.29 లక్షలను కేటాయించినదిట. దీనిలో రూ. 19.5 లక్షలు ఆంధ్రప్రాంతములోని ప్రాజెక్టుల పరిశోధనకి, రూ. 9.5 లక్షలు తెలంగాణా ప్రాంతంలోని ప్రాజెక్టుల పరిశోధనకి వినియోగించబడతాయి.

6. ప్రజలు తమ ఆహారపు అలవాట్లను మార్చుకొని, ఆరోగ్య ప్రమాణాల్ని అభివృద్ధి జేసుకొనడానికై రక్షకా హారాలను తినడం ఆరంభించాలని ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ సి. ఎమ్. త్రివేదీ ప్రపంచ ఆరోగ్య దినోత్సవం సందర్భంలో హైదరాబాదు నుంచి చేసిన రేడియో ప్రసంగంలో వుద్బోధించారు. నెల్లూరుజిల్లా గూడూరులోని మైకనైటు ఫ్యాక్టరీ హెచ్చు పని చేయడానికవసరమైన ఆర్థిక, సాంకేతిక సహాయాలను యివ్వడానికి కేంద్ర ప్రభుత్వం వాగ్దానం చేసినదిట.

7. 1956-57 లో సమాజాభివృద్ధి మంత్రిత్వశాఖ జరిపిన కృషి నివేదిక ప్రకారం, సమాజాభివృద్ధి, జాతీయ వికాస సేవాకేంద్రాల క్రింద 2,22,000 గ్రామాలున్నాయి. గ్రామీ ణుల సంఖ్య దగ్గరగా 1,299 లక్షలు. దీనిలో 36 శాతం తీవ్ర అభివృద్ధి కార్యక్రమం క్రింద, మిగిలినది జాతీయ వికాస సేవాకేంద్రాల క్రింద వుంది.

8. మునిసిపాలిటీలలో నీటి సప్లయి, నీటి సప్లయి అభివృద్ధి పథకాలు, రెండు మునిసిపల్ మురుగు పారుదల పథకాల అమలు నిమిత్తం యీ సంవత్సరం రాష్ట్రి ప్రభుత్వం రూ. 45 లక్షలవరకూ అప్పు యివ్వాలని సంకల్పించబడిందిట.

9. ఏకీకృతమైన పరపతి మార్కెటింగు సౌకర్యాలకై గ్రామీణ పరపతి సర్వేనివేదికలో తలపెట్టబడిన పైలట్ స్కీము ఒకటి అందుకు నిర్ణయించబడిన విశాఖపట్నం, పశ్చిమ గోదావరి, కర్నూలు జిల్లాల్లో అమలులో వుందని, దీనిక్రింద దాదాపు 917 రెవిన్యూ గ్రామాలు వున్నాయని సహకార సంఘాల రిజిష్ట్రారు ఒక సమీక్షలో పేర్కొ న్నారు.

10. ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి రాష్ట్రిశాసన సభ యునైటెడ్ కాంగ్రెసుపార్టీ నాయకుడుగా తిరిగి యేకగ్రీవంగా యెన్నుకోబడ్డారు.

భద్రాచలానికి సమీపంలో గోదావరిలో రెండు పడవలు దారుణమైన ప్రమాదానికి గురి అయినవి.

11. తెలంగాణా నుంచి కొత్తగా యెన్నికైన సభ్యులతో రాష్ట్ర శాసనసభ యీ మధ్యాహ్నం తొలిసారిగా సమావేశ మయింది. తెలంగాణా కొత్త సభ్యుల ప్రమాణ స్వీకరణ జరిగింది, అజెండాలోవున్న కార్యక్రమం యిదొక్కటే. సభవారు రెండు నిమిషాలు మౌనం పాటించి, తద్వారా గోదావరి పడవ ప్రమాదం పట్ల తీవ్రమైన సంతాపాన్ని వెలి బుచ్చారు.

12. అభ్రకం, జిప్సం, ముడియినుము, మాంగనీసు వంటి ఖనిజాల వ్యాపారాన్ని ప్రభుత్వం జరిపే విషయాన్ని గురించి రాష్ట్ర ప్రభుత్వం తీవ్రంగా పరిశీలిస్తున్నదని ఆర్థిక మంత్రి శాసనసభలో పేర్కొన్నారు.

13. రాష్ట్రాన్ని పారిశ్రామికం చేసే పథకాలలో కేంద్రం పాల్గొనే విషయాన్ని గురించి రాష్ట్ర ప్రభుత్వపు ప్రతినిధు లతో కేంద్ర ప్రభుత్వపు భారీ పరిశ్రమల మంత్రి చర్చించారు. కేంద్ర ప్రభుత్వం పాల్గొనాలని కోరబడిన పథకాలలో ముఖ్యమైనవి : హైదరాబాదులోని ప్రగాటూల్సు కార్పొ రేషన్ కాపిటల్ స్ట్రక్చరు, మానేజ్‌మెంటు, బోధన్‌లో న్యూస్‌ప్రింటు ఫ్యాక్టరీ, విశాఖపట్నంలో కార్బన్‌ఫ్యాక్టరీల స్థాపన.

14. ఖనిజాల వ్యాపారాన్ని ప్రభుత్వం చేగొనే ప్రతి పాదన విషయంలో, ప్రైవేటు రంగంలో జరిగే పనికి

తోడుగా మాత్రమే యిది వుద్దేశించ బడింది కాని దానిని తొలగించి వేయడానికి మాత్రం కాదని పరిశ్రమల మంత్రి పేర్కొన్నారు. రాష్ట్రంలో పరిశ్రమల అభివృద్ధి విషయంలో పారిశ్రామికులు ప్రభుత్వంతో సహకరించాలని ఆయన విజ్ఞప్తి చేశారు.

15. బోధన్‌లో వుద్దేశించబడిన న్యూస్‌ప్రింటు ఫ్యాక్టరీ నిర్మాణం ద్వితీయప్రణాళికకాలంలో పూర్తికాగలదని కేంద్రప్రభుత్వపు భారీపరిశ్రమలమంత్రి హైదరాబాదులో చెప్పారు. భూ సంస్కరణలకి సమగ్రమైన శాసనం ఒకటి మూడు నెలలలోపుగా ప్రవేశపెట్టబడగలదని ఆర్థిక, భూ సంస్కరణల మంత్రి రాష్ట్రశాసనసభలో చెప్పారు.

16. రాష్ట్ర శాసనసభ యివాళ పటిష్ఠం చేయబడిన సాధారణ అమ్మకంపన్ను. బిల్లును సెలెక్టుకమిటీ పరిశీలనకి పంపింది. సెలెక్టుకమిటీ తన నివేదికను సభవారికి ఏప్రిల్ 19 వ తేదీకి పూర్వం సమర్పించాలి.

17. భద్రాచలానికి సమీపంలో గోదావరినదికి వంతెన నిర్మించడానికి రాష్ట్రప్రభుత్వం కృతనిశ్చయమై వుందని ముఖ్యమంత్రి శాసనసభలో ప్రకటించారు. ఎంత ఖర్చయినా సరే యాత్రికుల సౌకర్యార్థం అది నిర్మించబడగలదన్నారు. పడవప్రమాదం కారణాలను దర్యాప్తు చేయడానికీ, అటువంటి ప్రమాదాలు మళ్ళీ సంభవించకుండా తీసుకొనవలసిన చర్యల్ని నివేదించడానికి 5 మంది సభ్యులతో ఒక కమిటీ నియమించబడింది.

రాష్ట్రంలో గ్రామీణ విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పే ప్రతిపాదనయొక్క వివిధ అంశాలను నివేదించడానికై 9 మంది సభ్యులతో ఒక కమిటీ నియమించబడింది.

18. 1956-57 లో నాగార్జునసాగర్ ప్రాజెక్టు ఖర్చుకై కేంద్ర ప్రభుత్వం రూ 156 లక్షల అప్పును మంజూరు చేసింది.

19. ముఖ్య మంత్రి మంత్రివర్గ సభ్యులకి పోర్టుఫోలియోలను తిరిగి కేటాయించారు.

20. పశ్చిమ గోదావరిజిల్లా గోపన్న పాలెంలోని విస్తరణ శిక్షణా కేంద్రంలో శిక్షణ పొందుతున్న వారి వుపయోగార్థం ఒక వ్యవసాయం క్షేత్రం నెలకొల్ప బడాలన్న ప్రతిపాదనను ప్రభుత్వం ఆమోదించిందిట.

21. రాజకీయ బాధితులకి సాగుకై భూములిచ్చే విషయాన్ని సాధ్యమైనంత త్వరలో తీసుకొన గలనని రెవిన్యూ మంత్రి చెప్పారు.

22. హైదరాబాదులో అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజీ స్థాపనకై కేంద్ర ప్రభుత్వం రూ 7 లక్షలను కేటాయించింది. ఇటువంటి రకం కాలేజీ ఆసియాలోకెల్లా యిదొక్కటే. ఇది అక్టోబరు నుంచి పని ప్రారంభించ గలదని భావించబడుతున్నది.

23. ఈ రాష్ట్రం అభ్యర్థుల సౌకర్యార్థం సెప్టెంబరులో హైదరాబాదులో ఒక పరీక్షా కేంద్రాన్ని ప్రారంభించి, ఫలితాలను చూడాలని యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషన్ నిర్ణయించినట్లు ఆధికారికంగా తెలియ చేయబడింది.



---

## అభివృద్ధికేంద్రాలలో జరుగుతున్న కృషి

[43 వ పేజీ తరువాయి]

విద్య, సాంఘికవిద్యా కార్యక్రమం క్రింద 29 కొత్త పాఠశాలలు ప్రారంభింప బడినవి. 93 మామూలు పాఠశాలలు వృత్తి విద్యా పాఠశాలలుగా మార్చబడినవి. ప్రజల ఆర్గనైజేషన్ యూనిట్లు 717 అభివృద్ధి చేయబడినవి. 288 కమ్యూనిటీ సెంటర్లు, 52 వయోజన కేంద్రాలు ప్రారంభింపబడినవి. 1176 మంది వయోజనులు అక్షరాస్యులు చేయబడినారు.

27 సహకార సంఘాలు ప్రారంభింప బడినవి. 5,487 మంది కొత్త సభ్యులు చేర్చబడ్డారు.

* * * *

# వార్తలు - విశేషాలు

ఇటీవలి సంవత్సరాలలో దేశంలో సాంఘిక విద్యా ఉద్యమం బాగా విస్తరిల్లింది. ఇప్పుడు చాలా మంది సాంఘిక విద్యా కార్యకర్తలు ముఖ్యమైన యీ జాతీయ కార్యక్రమంలో తమ కాలాన్ని, శక్తి యుక్తులను వుపయోగిస్తున్నారు. అయితే యీ కార్యక్రమంలో వృత్తిపరంగా వారికి తోడ్పడడానికి తగిన పుస్తకాలు తక్కువగా వున్నాయి. ఈ పరిస్థితిని చక్కచేయడానికి కేంద్ర ప్రభుత్వం సంకల్పించింది. ఇందు నిమిత్తం తీసుకొనే చర్యలలో ఒకటిగా పోటీకై దిగువవిషయాలపై వ్రాసిన వ్రాతప్రతులను ఆహ్వానించాలని సంకల్పించింది.

1. గ్రామీణ గ్రంథాలయాల పనిలోని సాంకేతిక అంశాలు.

2. గ్రామీణ సాంఘిక విద్యాకార్యక్రమంలో శ్రవణ - దృశ్య సాధనాల వుపయోగం - వుదాహరణకి, స్థానికంగా వుపయోగించడానికై, చార్టుల తయారీ, వుపయోగము.

3. రీడింగ్ సర్కిల్ల యేర్పాటు- ముఖ్యంగా గ్రామాలలో.

4. విద్యాబోధనా తరగతులలో చేరినవారిలో చదువుపట్ల ఆసక్తిని పుట్టించి, దానిని పోషించే విధానం.

5. అభివృద్ధి కార్యక్రమంలో సాంఘిక విద్యా ఆర్గనైజర్ పాత్ర.

ఉత్తమమైన వ్రాతప్రతులను సమర్పించిన రచయితలకి 5 బహుమతులు యివ్వబడతాయి. ఒక్కొక్క బహుమతి విలువ రూ. 250.00 పై 5 విషయాలలోను ఒక్కొక్కదానిపై ఒక్కొక్క పుస్తకం (వ్రాతప్రతి) వ్రాయబడాలి. వ్రాతప్రతులు ఇంగ్లీషులోనే వుండాలి. ఒక్కొక్క దానిలో యించుమించు 8-10 వేల పదాలుండాలి. ప్రతి వ్రాతప్రతికి చక్కగా టైపుచేసిన ప్రతులు మూడు సమర్పించబడాలి. అవి "అసిస్టెంటు యెడ్యుకేషనల్ అడ్వైజర్, విద్యామంత్రిత్వశాఖ, ఇండియాప్రభుత్వం న్యూఢిల్లీ"కి 30-6-57 కి పూర్వం చేరాలి.

## వ్యవసాయ పరిశోధన

రెండవ పంటకి తగినవిధంగా అక్కుళ్ళ రకాన్ని అభివృద్ధి చేయడానికి వుద్దేశించబడిన వ్యవసాయ శాఖ పథకం 1-4-57 నుంచి మరొక సంవత్సరం కొనసాగుతుంది.

హైదరాబాదు ప్రభుత్వం మంజూరు చేసిన పళ్ళుగ్రాసపు పరిశోధక పథకం 10-12-56 నుంచి రాజేంద్రనగర్లో అమలు జరుగుతున్నది. దీనికి ఇండియన్ వ్యవసాయ పరిశోధక కౌన్సిల్ ధనసహాయం చేస్తుంది. ఇప్పుడీ పథకం 1-4-57 నుంచి మరినాలుగు సంవత్సరాలు మొత్తం రూ. 62,343.00 ఖర్చుపై కొనసాగడానికి ప్రభుత్వం ఆమోదించింది.

పళ్ళు, కూరగాయలను నిలవచేయడంలో ఆంధ్రలో రైతులకి మూడు సంవత్సరాలపాటు శిక్షణ నిచ్చే పథకాన్ని కూడా ప్రభుత్వం మంజూరు జేసింది. మొత్తం దీనిఅంచనా ఖర్చు రూ. 12,588.00. దీనిలో రూ. 6000.00 వరకూ ఇండియన్ వ్యవసాయ పరిశోధక కౌన్సిలు భరిస్తుంది. ఆసక్తిగల రైతులు 72 మందికి కోడూరులో శిక్షణ నివ్వాలని తలపెట్టబడింది. శిక్షణ జట్టుల వారీగా యివ్వబడుతుంది. ఒక్కొక్క జట్టులో ఆరుగురు ఉంటారు. ఇటువంటి 12 జట్టులకి జట్టుకి మూడు నెలల చొప్పున శిక్షణయివ్వబడుతుంది.

## పాకిస్తానీయులు

1957 విదేశీయుల (మినహాయింపు) వుత్తరువుతో కలిపి చదువబడు 1957 విదేశీయుల లాస్ (సవరణ) ఆర్డినెన్సు జారీ చేయబడిన కారణంగా, పాకిస్తాను పాస్పోర్టు, వాలిడ్ ఇండియా విసాలమీద ఇండియాలో వుంటున్న పాకిస్తానీయులందరూ వారి వునికిని క్రమబద్ధం చేయడానికి వీలుగా రెసిడెన్షియల్ పర్మిట్లను తీసుకోవాలి. ఇందునిమిత్తం వారు వెంటనే తమతమ రిజిస్ట్రేషన్ అధారిటీలకు అనగా హైదరాబాదు, సికిందరాబాదులలో పోలీసు కమిషనరు, జిల్లాల్లో జిల్లా పోలీసు సూపరింటెండెంట్లు - వ్రాయాలి. పై ఆర్డినెన్సు నిబంధనల క్రింద, ప్రమాణం లేకుండా ఇండియాలోవున్న పాకిస్తానీయులపై చట్టరీత్యా చర్య గైకొనబడి, వారు ఇండియానుంచి పంపించివేయ బడవచ్చు.

## సైనికులకు ధన సహాయం

హైదరాబాదు సైనికుల బెనవలెంటుఫండు కమిటీ 9 వ, సమావేశం బేగం మెహ్దీ నవాజ్ జంగ్ అధ్యక్షతన వారి గృహంలో 17-4-57 న జరిగింది. ఆ నిధినుంచి ధనసహాయాన్నర్థించిన అంగ వికలులు, అస్వస్థులు అయిన మాజీ సైనికులు, వారి ఆశ్రితుల జాబితాను యీ కమిటీ సభ్యులు పరిశీలించారు. రూ 1,695 లను 21 మందికి పంచి యిచ్చారు. 1956 లో యీలా యివ్వబడిన మొత్తం సొమ్ము రూ 4,545.

* * * *

# దేశంతో పాటు మీరు కూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును భారత ప్రభుత్వ చిన్న మొత్తముల పొదుపు పథకంలో పెట్టుబడి పెట్టండి!

భారత దేశం యొక్క
సామాజికాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు,
రైలుమార్గములు రోడ్ల అభివృద్ధికి సహాయపడండి!

*మీ డబ్బును ఈ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| 12 సంవత్సరముల నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు | మెచ్యూరిటీ పొందినమీదట నూటికి ఏడాదికి 4.16 వంతుల చొప్పున వడ్డీ లభిస్తుంది. రూ. 5 లవి మొదలు రూ. 5,000 ల వాటివరకు ఈ సర్టిఫికెట్లు లభించును. వ్యక్తిగతంగా రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| 10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు | ప్రతియేటా నూటికి 3½ వంతుల చొప్పున వడ్డీ చెల్లించబడుతుంది. రూ. 100 లవి మొదలు రూ. 25,000 లవి వరకు లభిస్తాయి. వ్యక్తిగతంగా రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| 10 సంవత్సరముల జాతీయ ప్రణాళిక సర్టిఫికెట్లు | మెచ్యూరిటీ పొందిన మీదట నూటికి ఏడాదికి 4½ వంతుల చొప్పున వడ్డీ చెల్లించబడుతుంది. 5 రూ. లవి. 10 రూ. లవి. 25 రూ. లవి, 50 రూ. లవి, 100 రూ. లవి, 500 రూ. లవి ఇవ్వబడును. వ్యక్తిగతంగా రూ. 2,500 ల వరకు కొనవచ్చును. |
| పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు | డిపాజిట్లపై రూ. 10,000 ల వరకు నూటికి 2 వంతుల చొప్పున వడ్డీ చేర్చబడుతుంది. శేషముపై రూ. 15,000 ల వరకు నూటికి 1 వంతుల చొప్పున వడ్డీ చేర్చబడుతుంది. |
| 15 సంవత్సరముల ఆన్యూటీ సర్టిఫికెట్లు | నూటికి ఏడాదికి 3½ వంతుల చక్రవడ్డీతో నెలసరి కిస్తులుగా 15 ఏండ్ల లోపున తిరిగి చెల్లించబడుతాయి. జారీచేయబడు ధరలు ; రూ. 3,500, రూ. 7,000, రూ. 14,000 రూ. 28,000 వ్యక్తిగతంగా రూ. 28,000 ల వరకు కొనవచ్చును. |

## *ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!*
## *భారతదేశ ఉజ్జ్వల భవిష్యత్తుకొరకై పెట్టుబడి పెట్టండి!*

ఇతర వివరములకు, ఈ పెట్టుబళ్ళకు సంబంధించిన నియమావళికొరకు :
నేషనల్ సేవింగ్సు కమీషనర్, సిమ్లా చిరునామాకు గాని లేక
రీజనల్ ఆఫీసరు, హైద్రాబాదు (దక్కన్)
చిరునామాకు గాని వ్రాయవలెను.



అమెరికా రాయబారి మిస్టర్ ఎల్స్‌వర్త్ బంకర్ గౌరవార్థము ఆంధ్రప్రదేశ్ గవర్నర్ 12-4-1957 తేదీన రాజ్‌భవన్‌లో విందుచేశారు.



హైదరాబాదులోని రేడియం ఇన్‌స్టిట్యూట్, కేన్సర్ ఆసుపత్రిలో 27-3-1957 తేదీన జరిగిన ఒక సమావేశంలో శ్రీ రేపాల లక్ష్మీనరసారెడ్డిగారు కేన్సర్ ఆసుపత్రికి రూ. 25,000 లు విరాళం ప్రకటించిన దృశ్యం.